

కవిగారు సత్కారాలతో



శ్రీ చంద్రబాబు నాయుడు, రాష్ట్రముఖ్యమంత్రి గారితో
కవిగారి కుమారుడు డా॥ గౌతం ఆకునూరు

# కవిగారి
# ఓంకార నాదాలు




కవిగారు

ఆకునూరు గోపాలకిషన్ రావు


కవిగారి కళాపీఠం

అమ్మకృప - స్వర్ణాలయం

97, వాసవీ కాలనీ 'ఎ' సికింద్రాబాద్ - 15. ఆంధ్రప్రదేశ్

ఫోన్: 7747882

# కవిగారి ఓంకార నాదాలు

(7వ కవితా సంకలనం)

కవీత్వీకరణ
కవిగారు
(ఆకునూరు గోపాలకిషన్‌రావు)

ప్రథమ ముద్రణ
డిసెంబర్, 2000

వెల: రూ. 50/-

డి.టి.పి. రఫ్ :
బి. రాజేశ్వరి మాత
సూర్యశక్తి కంప్యూటర్స్, వాసవీ కాలనీ, 'ఎ', సికింద్రాబాద్.

టైప్‌సెటింగ్ ఫైనల్ కాపీ
శ్రీ ఉషోదయా గ్రాఫిక్స్
హైదరాబాద్. ఫోన్: 7612258

ముద్రణ :
బాల్‌రెడ్డి ప్రెస్
1-4-140, కళాసిగూడ, సికింద్రాబాదు - 500 003.
ఫోన్: 781 33 43, 621 85 95

ప్రతులకు :
అమ్మకృప - స్వర్ణాలయం
97, వాసవీ కాలనీ 'ఎ',
సికింద్రాబాద్ - 500 015.
ఫోన్: 7747882

# జై ఓం

ఒక శక్తి సృష్టి నడకను నికరముగా నిర్వహించు నీమము తోడన్
సకలబలుడు ఆశక్తిగ సకలురమూ వంచవలె తల సాకల్యముగాన్

జనావళిలో ఒకనిగా మనడంలో లేనే లేదు మహిత
అందరికన్నా భిన్నంగా ఆచరించడమే కదా ఘనత

'అ' అంటే సకలబలుడు 'ఉ' అనగా ప్రకృతి మాత తన తోడు
'మ' అంటే జీవాత్ముడు మరివి కలసిన ఓంకారము చూడు

ఓ సచ్చిదానంద సవితృతేజః పుంజము ప్రేరేపించునో సద్వర్తనము
అవిద్యాపాశహరుడాశుద్ధ స్వరూపుని ఆబుద్ధి నీయ ధ్యానింతుము

చదువుల తల్లీ సరస్వతీ చల్లగ చూడవె బ్రహ్మ సతీ
జనుల జ్ఞాన విజ్ఞానాలకు జన్మ ధన్యతకు కారయితీ

కమల నయని కామిత దాయిని వీణాపాణి విద్యాదాయిని
హంసవాహిని శుభప్రదాయిని ఆరంభింతును నమోస్తుతేయని

అక్షర లక్షల దొంతరలమర్చే శక్తి అంతగా నాకెక్కడిది
అన్నీ సకలబలుని లీలలు నా కలమాయనే నడిపించేది !

# అంకితమందుకోవయ

నాగార్జున సాగరం స్రష్ట ద్రష్ట నాలోని కవిని మేల్కొలిపిన మౌనరణం స్రష్ట
జ్ఞానపీఠ గ్రహీత ఆచార్య సినారెకు నా 'ఓంకార నాదాలు' అందించేదీ చేష్ట!



కవిగారు ఆచార్య సినారె గారికి 'ఓంకార నాదాలు' అందిస్తూ




జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణరెడ్డి ఎం.పి.**
ఎం. ఏ., పి.హెచ్.డి., డి.లిట్.
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి
కళాభవన్, హైదరాబాదు-500 004.

# స్వీకారం

శ్రీ ఆకునూరు గోపాలకిషన్‌రావు గారు తన బాణీలో పలికిన ఓంకార నాదాలివి.

రావుగారు లోకాన్ని తిరగేసి చూసినవారు. ఉర్దూ కవిత్వ పరిచయం వల్ల అభిప్రాయాలను కుదించి చెప్పే ఒడుపు చేజిక్కించుకున్నవారు. ఆ లక్షణం ఈ సంపుటిలోని ద్విపదుల్లో స్పష్టంగా కనిపిస్తున్నది. ఒక్కొక్కప్పుడు గోపాల కిషన్‌రావుగారు సూటిగా చెబుతారు. ఒక్కొక్క పర్యాయం చమత్కార ధాటిగా చెబుతారు. ఏది చెప్పినా వింతగా చెప్పాలనే నైజం వున్నవారు.

ఈ ''ఓంకార నాదాలు'' కవితా సంపుటిని నాకు అంకితమిస్తానని తన ఆకాంక్ష వెలిబుచ్చారు ఆయన. కాదని ఎలా అనను ? ''ఓంకారం'' నా ముందు వినిపిస్తుంటే ''స్వీకారం'' అనక తప్పదు కదా.

(డా. సి. నారాయణరెడ్డి)

# ఏమిటీ నాదాలు ?

ఆచార్య సినారె గారి 'మౌనరణం' తెలుగు గజలుతో ప్రభావితుడనై దాన్ని ఆంగ్లం, ఉర్దూ భాషల్లోనికి అనువదించి కవినై ఆయన మన్ననలు ఆశీస్సులు అనేకంగా ఐదేళ్ల క్రిందనే అందుకున్నవాణ్ణి నేను.

ఆనాటి నుండి యతి, ప్రాస, గణ వ్యాకరణ నియతులేవి పాటించకుండా నాదైన శైలిలో చౌపదలు, నాదాలు వ్రాసు కుంటున్నాను.

దేశ స్వాతంత్ర్యం కన్నా తొమ్మిదేళ్లు నేను పెద్ద వాణ్ణైనా అదే నెల అదే తేదీ పుట్టినందుననేమో నాలో సర్వ స్వతంత్ర భావాలే అన్ని విషయాల్లో చోటు చేసుకునుట వల్లనేమో అందరూ చెప్పేందీ విని నాకు తోచినట్లు చేయడం నా అలవాటు.

గత ఆగస్టు నెలలో నా సహస్రాధిక ఆత్మిక ఆధ్యాత్మిక సిరులు 'కవిగారి ఆత్మద్యుతులు' వెలువడి సర్వే సర్వత్రా మన్ననలందింది. సాక్షాత్ ఆంధ్ర పద్య కవితా పితామహులు శ్రీమాన్ నండూరి రామకృష్ణమాచార్యుల వారు ఈ పుస్తకం, చదివి నన్ను 'ఆపాదమస్తక కవి' - ప్రత్యక్షర కవి, శతశాతం కవి అని అభివర్ణించి ఆశీరభినందన అందించారు. ఒక జ్ఞానపీఠము, ఒక నోబుల్ పీఠము మరొక ప్రజా పీఠమందు కున్నంతగా వారి ఆశీస్సులు నాకు తురీయానందం కల్గించినవి.

ఈ పొత్తంలోనివి ఓ విధంగా ద్విపదలట్టివి. కాని వాటిని చర్విత చర్వణంగా ద్విపదలనే బదులు నాదైన ఓ పేరు పెట్టాలన్పించింది. మానసికంగా ఎపుడో ఓంకారునిలో లీనమైన నాకు వీటిని ఓంకార నాదాలనాలనిపించింది. వెంటనే దీనిపేరు "కవిగారి ఓంకార నాదాలు"గా భావించాను. ఇది శ్రీ సినారెగారి ముందు ఆయన్ను చూస్తూ కూర్చున్నపుడు కలగడం ఆ నారాయణుడే నాకిచ్చిన వరంగా తలుస్తున్నాను. నాకు "మౌనరణం" తెలుగు గజలు ద్వారా కవిత్వ స్ఫూర్తినిచ్చిన వరప్రదాత ఈ నారాయణుడే. నా తొలి పొత్తం "కవిగారి స్వగతాలు" ఆవిష్కరిస్తూ ఆయన నవంబరు 1996లో నన్ను వెన్ను చరిచిన విధం ప్రపంచంలో ఏ పితాశ్రీ తనయునికి ఇవ్వనంత గొప్పదని నా అనుభవం. అదే

నన్నీనాడు ఇంత త్వరగా ఐదేళ్లలో సప్తతి కృతుల కర్తగా నిలబెట్టిందని నా భావం. అయితే 1950 ప్రాంతాల్లోనే నా పెద్ద మేనమామ కీ॥ శే॥ శ్రీ దేవులపల్లి వెంకటేశ్వర రావు (దేవేరా) గారు నన్ను "కవిగారూ" అని పిలిచే వారు అందుకే నా కలం పేరయ్యింది. మరో రెండు సంవత్సరాలలో మా చిన్న మేనమామ గారు, నా స్నేహితుడూ, వేదాంతి, మార్గదర్శి శ్రీ దేవులపల్లి సుదర్శన్‌రావుగారు నా "స్వర్ణగోపాల శతకం" ఆ ముఖంలో ఈ శతాధిక పద్యాలే కాక వీడు శతాధిక గ్రంథాలు త్వరలో పూర్తి చేస్తాడని ఇచ్చిన ఆశీర్వాదం నిజంచేయడానికి కూడా అంచనాలు సిద్ధించుకున్నాని సాహితీ మూర్తులందరికి సవినయంగా తెల్పు కుంటున్నాను.

భగవానునికి విశ్వాత్మ సదృశంగా ఉండాలని "సకల బలుడని" పేరు పెట్టుకుని వ్యవహరిస్తున్న నేను

అక్షర లక్షల దొంతరలు
అమర్చే శక్తి నాకెక్కడిది
అన్నీ 'సకల బలుని లీలలు
ఆయనే నా కలం నడిపించేది !

అని నమ్మేవాడిని కనుకా ఈ "ఓంకార నాదాలు" అను పేరు సమర్థనీయం. ఆముఖాలు కూర్చి ఇచ్చిన వారందరునూ ఇందులోని కవితలు ఈ పేరుకు న్యాయంచేకూర్చాయనడం వల్లనూ నా జన్మ తరించింది. వారందరికీ నా నమో వాకములు.

జనావళిలో ఒకనిగా
మనడంలో లేదు మహిత
అందరికన్నా భిన్నంగా
ఆచరించడమే ఘనత ! అన్నది నా జీవనాదం

నా చౌపదలలాగే నా ఈ నాదాలు పాఠకులందరి మనస్సులలో పరిమళాలు నింపుతాయని ఆశిస్తూ

మీ

21-11-2000 కవిగారు

# రాష్ట్ర గానం

ఇది ఆంధ్రము పుట్టిన భూమి ఇది ఆంధ్ర జనావళి రాష్ట్రం
ఇది దాన వీర శూర కరుణాళులున్న నేల
జన అభ్యుదయమ్మిట నిత్యం మన రాష్ట్ర ప్రభుత్వము లక్ష్యం
మన రాష్ట్ర వృద్ధి కోసం జనముద్యమించినారు
జన్మభూమి జన్మభూమి జయహో జన్మభూమి !

పరిపాలన ఊళ్ళకు వెళ్ళి ప్రజలందఱి పాట్ల నెరింగి
ఒక చంద్రుని చల్లదనాన్ని జన జీవనమందున నింపి
క్రమ శిక్షణతో ప్రజలంత శ్రమ శక్తికి యుక్తిని చేర్చి
మన బాపు గ్రామ రాజ్యం కల పూర్తియౌట తథ్యం
ఇది ఆంధ్రము పుట్టిన భూమి ఇది ఆంధ్ర జనావళి రాష్ట్రం
ఇది దానవీర శూర కరుణాళులున్న నేల !

మన ఆంధ్రులు గోళము నెల్ల ఘనకీర్తి వహించుచునుండ
మన విశ్వమానవత్వం మహిదద్దరిల్లు నింక
ఇక దేశము మాత్రమనేమి భువిలోన ప్రసిద్ధిని చెంది
ఇది స్వర్ణ ఆంధ్ర రాష్ట్రం అయి తాను ముందు నిల్చు
ఇది ఆంధ్రము పుట్టిన భూమి ఇది ఆంధ్రజనావళి రాష్ట్రం
ఇది దాన వీర శూర కరుణాళులున్న నేల !

జన్మభూమి జన్మభూమి జయహో జన్మభూమి!
జన్మభూమి జయహో జయహో జన్మభూమి !!!



## నా ప్రాణం

ఒక మంచికి నవ్వనా
ఒక చెడుకే ఏడ్వనా
ఒక మంచీ ఒక్క చెడూ
ఒకేసారి దూసుకొచ్చి
ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే
ఓర్మిని చంపేస్తుంటే
సమన్వయం కుదరకుండ
చచ్చినంత పనౌతుంటే
ఒక మంచికి నవ్వనా
ఒక చెడుకే ఏడ్వనా!

నాకే ఎందుకిలా
నగుబాటౌతున్నది
నేనూ అందరిలా
కాదనా ఇటులౌతున్నది

అందరిలా నేనైతే

అందులోన గొప్పేమిటి

ఆదర్శంగా బ్రతికితే

అదేమైనా తప్పేమిటి

ఒక మంచికి నవ్వనా

ఒక చెడుకే ఏడ్వనా !

మంచి మరీ క్షణకాలం

చెడు మాత్రం చిరకాలం

మరీ మరీ జీవితాన్ని

మరణంవైపుకు లాగటాన్ని

ఎవరి పనని చెప్పుకోగలను

ఎలా నేను తప్పుకోగలను

ఒక మంచికి నవ్వనా

ఒక చెడుకే ఏడ్వనా !



తళుకు్కున మెరువగనే ఉదాత్త భావం తలలో తక్షణం నాదమై
కలంలోనికి దూసుకుపోతుంది మార్దవంగా గిలకడం కోసమై

ఈ నాదాలు కూర్చడంలో ఎందరెందరో ప్రేరకకారకులు
అందుకనే కవిగారికి వారందరూ దక్షిణామూర్తి సమానులు

సోహమిందులో సొంతాలు సోహమేమో అనువాదాలు
స్వచ్ఛంద నాదాలివి కవిగారి శతాధికమైన అందాలు

యతి ప్రాసగణ సంధి గణ నియమాల్వ్యాకరణం పాటించని
అతి విలక్షణమైన నాదాలివి అరమరిక లేక ఆలకించిరేని

సకలబలునిస్పష్ట్యందాలుపూలూ పూబోళ్ళు మొుళ్లమా కందఫలాలు
సుమిరా వీటికేమాత్రం తీసిపోనివి సుమా "కవిగారి ఓంకారనాదాలు"

నా నాదాలు ⟶

నాకూ వ్రాయాలని ఉన్నదొక్క నాణ్యమైన గజలు
మిరూ గాలిబ్‌ల కోవదొక్క మేటిదైన గజలు

రాగయుక్తముగ పాటలాగ దాన్ని గొంతెత్తి అలాపిస్తుంటే
విరబూయాలి పూలై సభలో కరతాళములైన ధ్వనులు

ఎందుకు కవిగారూ గజళ్ళంటే ఇంత పిచ్చి ప్రీతి మీకు
గాలిబూ మీర్‌లవే గాక ఉన్నాయెన్నెన్నో ఘనమైన కైతలు

ప్రేయసి పొగడ్తకే అంకితమై పుట్టిన దానాడేనాడో ప్రక్రియ
భాషాయోష తిలకమాయె నేడు బహుధా సొంపైన గజలు

ఛందములెన్ని స్పృశించినా గాని కవికుండని ఆత్మతృప్తికి
కందముతో సరితూగేదెంతగానో అందమైన గజలు

గజలనేది ఉరుదూ ప్రక్రియ కాదింకే మాత్రం చూశారూ
అన్య భాషీయులూ అందిస్తున్నారు నేడు గజలులోన కవితలు

ఆంధ్ర మహాకవి దాశరథి అందించిన నజరానా తెలుగు తల్లికి
అంతటి గజలురుదూది ఎంతగనో తెనుగుదైన గజలు



జ్ఞానపీఠి శ్రీ సినారె గారు గజళ్ళెన్నెన్నో అన్నాడు ఏళ్ళ నుండి
ప్రతి గజలులోన తాను పూయించెనహో భవ్యమైన భావాలు

ఆంధ్రలోన ఈరోజు అంటున్నారెందరో గజళ్ళను
రెడ్డిగారి ఒరవడిలో రెపరెపలు గజలువైన జండాలు

గజలనేది చూడ చూడగా గంధర్వ గానమంత నాదమే
ప్రతి పలుకూ నారదుడిదదో బహు దివ్యమైన గజలు

దాశరథీ అనంతయ్య బుచ్చారెడ్డి కవిగారూ శ్రీ మాన్యులు
అందించారురుదూ గజళ్ళకు తెలుగున ఆర్ద్రమైన వెల్గులు

ప్రేమికులందరికీ కూడా ప్రియసఖులు తాము గజళ్ళైతే
అసలు ప్రేమికులకు పెళ్ళనేది అదో రాసమైన గజలు

గజలు సుందరి మీది గజల్ రుబాయీల తెలుగందాలైనా
కవిగారూ మీకైతలతో కాంతించును చీకటైన రేపగలులు!



# వీరెల్లరికీ ఎంతగానో కృతజ్ఞుడను

- జీవన సంధ్యాసమయంలో నన్నో కవిగా రూపొందించి నా జీవితానికి ధన్యత నాపాదించిన సర్వశక్తిమంతుడైన సకల బలునికి.

- నాలో తన 'మౌనరణం' తెలుగు గజలు ద్వారా కవితా వేశాన్ని రేకెత్తించిన జ్ఞానపీఠ గ్రహీత ఆచార్య సి.నారాయణరెడ్డిగారికి

- తమ వద్ద నన్నుంచుకొని విద్యాభ్యాసం చేయించిన తాతయ్య, అమ్మమ్మలు శ్రీ దేవులపల్లి కేశవరంగారావుగారు శ్రీమతి కీ॥శే॥ దేవులపల్లి ఆండాళమ్మ గారు, మా మాతామహులకు -

- తమ ఆకృతులు, ఆస్తి,వైభవాలు వారసత్వాలుగా అందించిన పితామహులు కీ॥శే॥ ఆకునూరు అప్పారావుగారు, ఆకునూరు వెంకట నర్సమ్మగార్లకు-

- నన్నెంతగానో అభిమానించిన పెదతాతగారి కుమారుడు పెద మేన మామయ్య కీ॥ శే॥ దేవులపల్లి రామానుజారావుగారికి -

- నా పదవయేటనే నన్ను కవిగారూ అని పిలిచిన మహాకవి, భవిష్యద్ఞాని పెద్దమేన మామయ్య కీ॥శే॥ దేవులపల్లివెంకటేశ్వర రావు (దేవేరా) ఆయన సతీమతల్లి కరుణత్తయ్యకు-

- స్నేహితుడు, హితుడూ, వేదాంతి, మార్గదర్శి (నేను అన్నయ్యా అని పిలిచే పినమేనమామ) శ్రీ. దేవులపల్లి సుదర్శన్, ఆయన అర్ధాంగి సరోజనమ్మత్తయ్యకు-

✣ నన్ను కని పెంచి నేనో ఇంజనీరు కాగా అమితంగా ఆనందించి అనుకోని విధంగా కవినైనప్పుడాశ్చర్యపడిన నాన్నా అమ్మలు- శ్రీ ఆకునూరు లక్ష్మీనరసింహారావుగారు, శ్రీమతి కీ॥ శే॥ ఆకునూరు రాధాదేవిగార్లకు -

✣ నన్నమితంగా అభిమానించే శ్రీమతి డా॥ ఆకునూరు స్వర్ణ లతకు మా కూతురూ అల్లుడూ Dr. వేమూరి స్వప్న - Er. వేమూరి క్రిష్ణవారి పిల్లలు చిరంజీవి శౌర్య, బాబూ చి॥ స్ఫూర్తిలను

✣ చిరంజీవి డా॥ ఆకునూరు గౌతం - ఆకునూరు శైల కోడలు వారి కుమారుడు (నాకు 'కవిగారు' అన్న బిరుదును చిన్నప్పుడే ఇచ్చిన నా మేనమామ నా అభీష్టం మేరకు తన ఆశీఫలం కవిగారిని చూడడానికి మరల పుట్టాడనుకొనే నా మనుమడు) చిరంజీవి అమోఘ ఆకునూరులకు - నా ముగ్గురు తమ్ములు వారి భార్యా పిల్లలకూ - ఐదుగురు చెల్లెళ్ళు వారి కుటుంబాలకూ -

✣ అడగ్గానే కరుణతో ఈ పొత్తానికి "స్వీకారం" సమకూర్చి ఇచ్చిన ఆచార్య సినారె గారికి-ఆహ్లాదంగా అసమాన శైలిలో ఆముఖాలు వ్రాసి పెట్టిన డా॥ ఎన్. గోపి గారికి, డా॥ తిరుమల శ్రీనివాసాచార్యగారికి, డా॥ మృణాళిని గారికి, శ్రీమతి డా॥ ఆకునూరు స్వర్ణలతకు, శ్రీ ఎస్. వెంకట రంగారెడ్డి గారికి, డా॥ కర్నాటి లింగయ్య గారికి సోదరతుల్యులు సుమనస్కుడు శ్రీ సౌభాగ్యకు, శ్రీ కె. ఆర్. కెమోహన్‌ను, విద్యున్మిత్రుడు హితైషి చి॥ టి. ఎన్. యన్ మూర్తి (మారుతి) ని, ఎంతో శ్రమకోర్చి నవ్వుతూ, నవ్వుతూనే నాణ్యమైన కంప్యూటర్ కాపీని అందించిన సుమనస్వి ఉషోదయా గ్రాఫిక్స్ అధినేత్రి రమాదేవిని, శ్రమకోర్చి చక్కగా ముద్రించిన బాల్‌రెడ్డి ప్రెస్ సి.బి. హన్మంత రెడ్డిని, సి.హెచ్.

జయపాల్ రెడ్డిని, నిర్వాహకుడు ఎ. బాల్‌రాజ్‌ను, చివరకైనా చిన్న యే మాత్రంకాని మిత్రరత్నాలు సూర్యమిత్ర, సూర్యశక్తి పెద్దలు ఎడిటర్ పాణుగుపాటి కృష్ణమూర్తిగారికి, ఆంధ్రవ్యాస శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారికి, ఆర్ష కవి భూషణ సత్యంనాయుడు గారికి, సుమనస్వి పటేలు అనంతయ్యగారికి, శ్రీ అనిపెద్ది వెంకట రమణారావు గారికి, సూర్యశక్తి కార్యాలయ సిబ్బంది, కంప్యూటర్ అధినేత్రి శ్రీమతి బి. రాజేశ్వరీ మాతకు, సహాయకుడు శ్రీయుతులు ఎం. రాజ్‌కుమార్‌ను వాహన చాలకుడు కె. అమృతయ్యను ఎవరినీ మర్చిపోలేను. అందరికీ కృతజ్ఞతలు

కవిగారు

5-12-2000

## ఆశీరభినందనలు

'కవులు' ఛందోవ్యాకరణాలంకారసూత్ర పంజరనిబద్ధులు. 'కవిగారు' ఆకునూరు గోపాల కిషన్‌రావు గారి తీరే వేరు. ఆయన సర్వతంత్ర స్వతంత్ర సాహితీ ప్రియంభావకుడు. గరుత్మంతుడు – ఆకాశయానుడు – ఆగని ప్రస్థాన ప్రియుడు. యధేచ్ఛా గమనశీలి. భౌమ్యావరణం విడిచి 'బరువు' లేని సీమిత లోకోన్నతుడై విహరించగలడు, రోదసీ కుహరంలో – గ్రహాంతరయానంలో.

ఉపనిషత్ ప్రపంచవిహారి, ఆధ్యాత్మయాన క్రియాశక్తి – సాహితీ జీవన్ముక్తుడైన "కవిగారికి" నా ఆశీరభినందనలు.

5/20-12-2000

నందూరి రామకృష్ణమాచార్య
పూర్వ అధ్యక్షులు – అధికార తెలుగు భాషా సంఘం

# చైతన్యగీతాలు - ఓంకార నాదాలు

ఇంజనీరుగా విద్యుత్‌శాఖలో వెలుగులు ప్రసరించిన ఆకునూరు గోపాల కిషన్‌రావు 'కవిగారు' గా నామ సార్థక్యంతో సాహితీ జ్ఞానజ్యోతులు వెలిగిస్తున్నారు. ముఖ్యంగా కవిత్వం అంటే ఎంతో మమకారం ఉన్న కవిగారు 1995 నుంచి ఇప్పటివరకు ఆరు గ్రంథాలు అందించారు. ఇప్పుడు 'ఓంకారనాదాలు' పేరుతో మరోసారి కవితాప్రియుల హృదయతంత్రులను మీటుతున్నారు. మరో 63 గ్రంథాలు ప్రచురణకు సిద్ధం చేసారంటే కవిగారు రచనా వ్యాసాంగాన్ని తపస్సుగా తీసుకున్నట్లు అర్థమౌతుంది. వివిధ అంశాలను వస్తువుగా స్వీకరిస్తూ కవితలు అల్లుతున్న కవిగారు ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ భాషలలో ప్రావీణ్యం ఉండటం చేత ఉర్దూ గజళ్ళను, కవితలను, పాటలను తెలుగులోకి అనువదించి మంచి అనువాదకునిగా కూడా పేరు గడించారు.

పండితులు, పత్రికలు కవిగారి రచనా పటిమకు, ఆధ్యాత్మిక చింతనకు, కవితా శైలికి నీరాజనాలర్పించారు. అందుకే తెలుగు సాహితీక్షేత్రంలో ఎంతోమంది కవులున్నప్పటికీ 'కవిగారు'గా వీరి మేనమామగారాశీర్వదించినదే వీరికి వాడుక పేరయ్యింది. నలుగురికి తన హృదయాన్ని పంచడమే తన కవిత విధానమని సగర్వంగా చాటుకున్నారు. ఆధునిక కవితా ప్రపంచంలో తనకో ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు. ఆగస్టు నెలలో 'కవిగారి ఆత్మద్యుతులు' గ్రంథాన్ని వెలువరించి పాఠకుల మన్ననలు అందుకున్న కవిగారు ఈ డిసెంబరులో 'ఓంకార నాదాలు' పలికిస్తున్నారు.

''జనావళిలో ఒకడుగా మనడంలో లేనే లేదు మహిత
అందరికన్నా భిన్నంగా ఆచరించడమే కదా ఘనత''

అనడమే కవిగారి ప్రత్యేకత. శీర్షికలు లేకపోయినప్పటికీ ముక్తకాలుగా ఉండి వస్తువైవిధ్యం ఉన్న ఈ కవితలు హాయిగా చదివిస్తాయి. సామాన్య విషయాలకు కూడా కవితారూపాన్నిచ్చి పాఠకులను చైతన్యపరిచే విధంగా ఇవి ఉన్నాయి.

"ఇక్ష్వాకుల కాలం నుండి తెలియనిదా ఈ దేశం ఖ్యాతి ప్రఖ్యాతి
ఎందుకిలా నిర్వీర్యమౌతున్నది జాతులలో సమున్నతజాతి".

ఎంతో గొప్ప పేరు ప్రఖ్యాతులు గాంచిన హైందవ జాతి నేడు జాతి, మత, వర్గ వైషమ్యాలతో నిర్వీర్యం కావడాన్ని చూసి ఆవేదన వెలిబుస్తారు. న్యాయ స్థానాల్లో న్యాయం సత్వరంగా అందించే న్యాయమూర్తులు కావాలంటారు. న్యాయాన్యాయ విషయాల బేరీజులో తప్పుడు సాక్ష్యాలకు విలువ ఇవ్వకూడ దంటారు. మితాహారమే అతి గొప్ప ఆరోగ్య రహస్యం అనే నిత్యజీవిత సత్యాన్ని చెప్తున్నారు. ఆదర్శ గృహస్తు, శ్రమజీవి, జీవితాశ, డబ్బు కంటే పెట్రోలు ఎంత విలువైందో తెలియజేయడం, ఎయిడ్స్ గురించిన అంశాలు వీటిలో ఉన్నాయి. జనాభా పెరుగుతున్నదేగానీ, మనుషుల్లో మానవత్వం పెరగటం లేదంటున్నారు.

"లక్షలు కోట్లు సంపాదించడమే కాకూడదు లక్ష్యం
విలువల పరిధిలో బ్రతికిందే వేల్పులట్టి జీవితం !"

అంటూ అధికారంలోవున్న వారికి నైతిక విలువలు ప్రబోధిస్తున్నారు. ఈనాడు విస్తృతంగా చర్చిస్తూ, ప్రజల్లోనూ, ప్రభుత్వంలోనూ నానుతున్న అంశం ఇది.

"మక్కువ మన భాషపై చూపే దిక్కూ దివాణమేది
మనల నుద్ధరించగల బ్రౌను దొరల బలగమేది !"

తెలుగు భాష పునరుద్ధరణ కోసం బ్రౌను దొరలాంటి వారు రావాలనే ఆకాంక్ష ఇందులో కన్పిస్తుంది.

సమాజంలో వస్తున్న నూతన భావాలకు అనుగుణంగా నడుచుకోవడం, సర్వజన సమాదరణ, సామర్థ్యం, అనేవి తరగని గనులనీ, కష్టసుఖాలు జనులందరికీ ఉంటాయనే సత్యం, తెలుగు కంప్యూటర్ల శతశాతం, అవశ్యకత, కాలనాగు, శాంతి సౌభ్రాత్రాలు, సముద్రంలో కలువక ముందు నదికి గల ప్రాశస్త్యం, డబ్బు కోసమే బ్రతకడం అనే తప్పుడు భావనను వీడడం, పనిచేసే వారిని సమర్థులుగా గుర్తించడం లాంటి అనేక విషయాలు ఈ గ్రంథంలో ప్రస్తావించారు కవిగారు.

"ముట్టుకుంటే కాల్చేది నిప్పు పట్టుకుంటే కూల్చేది అప్పు
కొత్తదేతై కరిచేది చెప్పు ఏమైనా చేయకూడదంది తప్పు"

అంటూ సామాన్య విషయాలను కూడా కవితా రూపంలో చెప్పగలిగిన కవిగారు 60 మంది ఉర్దూకవులు, 17 మంది హిందీ కవుల కవితలను తెలుగులోకి అనువదించి, చెపితే తప్ప ఇవి అనువాదాలు అని తెలియనంత ఉత్తమంగా ఆ పని చేశారు.

"హైదరాబాదు ఆతిథ్యం అందరికీ ఆనందమనాలి
ఇక్కడ అతిథైతే ఓనాడు ఇంకపోలేడీ వూరొదిలి !"

పై కవితలో తెలుగుదనమే గాదు, హైదరాబాద్‌కు అతిథులను ఆదరించడంలో గల ఔన్నత్యం కన్పిస్తుంది. మోమిన్‌ఖాన్ షెఖ్‌గారి ఉర్దూ కవిత తెలుగులో చక్కగా ఇమిడిపోయింది.

"అబద్దాల అద్దాల మేడల్లో అంతటా నోట్ల పడకలు
నిజధనుల నివాసాలలో నేడు రేపటికే సామగ్రులు !"

అక్రమ సంపాదనతో అద్దాల మేడల్లో నివసించే వారి ఇళ్ళలో డబ్బు ఎక్కడ పడితే అక్కడ విచ్చలవిడిగా దొరుకుతుంది. కానీ నీతి నిజాయితీగా బ్రతికే వారికి అపూటకాపూట తినడానికే కష్టంగా ఉంటుంది. కష్టజీవి తన శ్రమకు ప్రతి ఫలం పొందలేక పోగా, అక్రమార్జనలో సంపాదించుకున్న డబ్బు సంపాదించే వారు దాచుకొనే స్థలం లేక పొందే బాధ ఇంత - అంత కాదని ఉమాశ్రీ గారి హిందీ కవిత తెలియజేస్తుంది.

వయస్సు పెరుగుతున్న కొలదీ, పరిణత రమ్యంగా రచిస్తున్న కవిగారు అభినందనీయులు. సామాన్య విషయాల్ని సైతం కవితా వస్తువుగా స్వీకరించి, సులభ శైలిలో, పాఠక హృదయాల్ని తాకే విధంగా రాయడం వారి రచనా వైశిష్ట్యానికి నిదర్శనం. చక్కని రచనలతో సాహితీలోకంలో దూసుకుపోతున్న కవిగారి 'ఓంకార నాదాలు' పాఠకులకు జీవనాదాలు కావాలని ఆకాంక్షిస్తున్నాను.

ఎన్. గోపి

17-12-2000

వైస్ ఛాన్సలర్

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

# నెలరేడుకు జేజేలు

కవిగారు (ఆకునూరు గోపాల కిషన్‌రావు) 'ఓంకార నాదాలు' అనే పేరుతో గజళ్ళను రచించారు. వారిదివరకే గూనమైన గాలిబ్ గజళ్ళను కొన్నిటిని, ఇతర ప్రముఖ ఉర్దూ కవుల గజళ్ళను తెలుగులోకి అనువదించి 'గజలు సుందరి' అనే పేరుతో ప్రచురించారు. గజల్ అనేది సున్నితమైన, సుకుమారమైన కవితా ప్రక్రియ. అది అందరికీ పట్టుబడేది కాదు. తెలుగు కవితా ప్రియులకు మొదట దాశరధి గారు గజల్‌సుందరి గజ్జెల గలగలలు వినిపించగా, ఆ కవితా ప్రక్రియను వియత్త లానికి తీసుకొని వెళ్ళి విస్మయావహం చేశారు. ఆచార్య సి. నారాయణరెడ్డిగారు.

కవిగారు 'కాంతి శక్తి' ఇంజనీరు (ఎలక్ట్రికల్ ఇంజనీరు)గా పదవీ విరమణ చేయడానికి కొన్ని మాసాల ముందు సినారెగారి 'మౌనరణం' అనే గజల్‌మధుర గమనానికి, భావౌన్నత్యానికి పరవశుడై, దానిని ఇంగ్లీషులోను, ఉర్దూలోను తర్జుమా చేయడంలో తరగెత్తిన కవితాతరంగం, నేడది వెల్లువై, కవితాభిమానులను ముంచెత్తుతున్నది 'గజలు సుందరి'గా 'ఓంకార నాదాలు'గా మరెన్నో రచనా నదాలుగా వయసులో ఇంచుమించు సినారె సమకాలికులైనా, సినారెగారి కవిత్వం తో స్ఫూర్తి పొందిన, ఐదేళ్ళ కిందటి కవితా శిశువు అవిశ్రాంతంగా, అవిచ్ఛిన్నంగా అనేక రచనలు చేసి, నేడు సాహితీ ప్రియులను అలరిస్తున్న అసాధారణ కవి అయ్యారు 'కవిగారు'. వయసు పైబడుతున్నా ఉరకలు వేస్తున్న రచనోత్సాహపు నవయౌవనంతో సాగిపోతున్న 'కవిగారి' రచనా వ్యాసంగాన్ని చూస్తే ఆశ్చర్యం వేస్తుంది అస్మదాదులకు. వారిప్పటికే 7 పుస్తకాలు పైగా ప్రచురించి మరెన్నో రాసి ప్రచురించాలనే ప్రయత్నంలో ఉన్నారు.

' ఓంకార నాదాలు' అనే గజల్ కవితా సంపుటి 'కవిగారి' హృదయపుటి. కవిగారు గజల్‌కవితా ప్రక్రియలను ఎంతగా ప్రేమించారో, ఆరాధించారో అవగత మవుతుంది, ఏ పుటపట్టి చూసినా, ఏ 'షేర్' తార్ మీటినా, కవిగారు రాసిన 'ఓంకార నాదాలు' గజళ్ళలో గజల్ నియమాలన్నీ ప్రతిదానిలోను పాటించక

పోయినా, చాలావరకు పాటించినవే ఎక్కువ. అన్ని 'షేర్'లలోనూ అంత్య ప్రాస నియతంగా ఉంటుంది. చాలా ద్విపదల పాదాద్యక్షరాలలో ఏకాక్షరాల నియతి, పాదదైర్ఘ్య సమత (అక్షర సమత లేదా మాత్రా సమత) వంటి నియమాలను చాలా వరకు పాటించి, 'తఖల్లుస్' కవి నామ ముద్ర 'కవిగారు' ను మాత్రం తప్పని సరిగా ప్రతి చివరి ద్విపద (మఖ్తా)లో పాదిగి రచించిన గజళ్ళు ఇవి. ఈ కవితా సంపుటిలో సొంత గజళ్ళతో పాటు, మరికొందరి ఉర్దూ, హిందీ కవుల గజళ్ళకు అనువాదాలు కూడా ఉన్నాయి.

ఆలోచనలు అందరికీ వస్తాయి. మంచి ఆలోచనలు కొందరికే వస్తాయి. వాటిని సరళంగానో, ఉదాత్తంగానో, సుందరంగానో వ్యక్తీకరించే వారు కోటి కొక్కరుంటారు. నల్గురి కోసం కరిగి పోవడంలో మహదానందాన్ని అనుభవించే మంచి మనిషి అయిన 'కవిగారు' 'నల్గురకూ హృదిపంచడం నా కవితల నడత విధానం, నల్గురనూ ఎదగ జూడడం నా కన్నుల ఎద ఆరాటం' అని చెప్పుకొన్న 'కవిగారు' ఇతరుల మంచిని కోరే మంచి ఆలోచనలెన్నిటినో సరళమైన భాషలో, సరళ కవితా రీతిలో మనస్సుకు పట్టేలా రచించిన కవితా తరళమీ 'ఓంకార నాదాలు'.

కోపం ముంచుకొచ్చినప్పుడు వంద దాకా లెక్కపెట్టు
పాపం అదింకా తగ్గకుంటే ఆ ప్రదేశమే విడిచిపెట్టు

ఎంత మంచి సలహా ఇది. 'ముట్టుకుంటే కాల్చేది నిప్పు, పట్టుకుంటే కూల్చేది అప్పు. కొత్తదైతే కరిచేది చెప్పు - ఏమైనా చేయకూడందే తప్పు' - ఎంత మంచి ఆలోచన ఇది. 'దుఃఖం నాది చూపొద్దని కన్నీరాపితిని - చిరునవ్వున కనిపించే చింతనాపలేనైతిని' ఎంత ఉదాత్తమైన ఊహ ఇది. తన విస్తృతమైన జీవితానుభవాలను ఇతరుల మేలుకోరి ఇంత సరళంగా ఇలా రాస్తూ రాస్తూ రాశులు పోసిన ఈ గజళ్ళలో ఆణిముత్యాలెన్నో, అపరంజి చిత్రాలెన్నో.

'పిడుగా నీవెక్కడపడినా, ఫరవాలేదు గాని, పిచ్చుకపిల్లలున్న గూటిపైపడకు' అని అన్నప్పుడు బసవరాజు అప్పారావు భావం తళుక్కుమన్నా, కవిగారి మనస్సు

లో మొదిలేది అదే ఆలోచనే. అలాగే సినారెగారి గజళ్ళలోని భావాలు కొన్ని స్ఫురించినా, వాటికివిన కళ్ళు కావు. సొంత పోకళ్ళు పోయినవెన్నో ఉన్నాయి. సొంత ఊహలను, సొంత ఆలోచనలను, ఎన్నిటినో గజళ్ళలో హృద్యంగా పలికించి, తన కవితా స్ఫూర్తి సినారెకు నైవేద్యంగా సమర్పించిన కవిగారిని మనసారా అభినందిస్తున్నాను.

'కాంతి శక్తి' అధికారిగా నెలకొక సబ్‌స్టేషన్ పదునాలుగు నెలల విశ్రాంతిగా నిర్మించి ప్రజాసేవ చేసిన ఆకునూరు గోపాలకిషన్‌రావు గారు 'క్రాంతి శక్తి' పథంలో పయనించి కవిగారు గా నెలకొక కవితా సంపుటిని లిఖిస్తూ, కవిత్వపు వెన్నెలను వెదజల్లుతున్న 'నెలరేడు'కు జేజేలు.

ఆచార్య జి. చెన్నకేశవరెడ్డి
డైరెక్టరు, విజ్ఞాన సర్వస్వ కేంద్రం
పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం



# నాదామోదం

మిత్రులు శ్రీ కవిగారిని నేను నాలుగైదేళ్ల కింద మొదటిసారిగా చూశాను. సాహిత్యచైతన్యమూర్తి శ్రీ పోతుకూచి సాంబశివరావుగారి ఇంట్లో గత సంవత్సరం వారి కావ్యం 'ఆత్మద్యుతులు' ఆవిష్కరణ సభలో పాల్గొన్నాను. దూరదర్శన్ కవి సమ్మేళనంలో మరోసారి ఇరువురం కలిశాము. ఇలా ముచ్చటగా మూడు సార్లు కలిసి మేం మిత్రులమయ్యాము. ఆ మధురమైత్రీ బంధమే ఈ నాలుగు మాటలు ఇలా వ్రాయడానికి కారణమూ ప్రేరణమూ.

నాతో కలిసినప్పుడు శ్రీ కవిగారు తమ కావ్యాలు కొన్ని నాకు అందించారు. వాటిని చూసి, చదివి ఆనందించాను.

కవిలోకంలోకి మరోకవి ప్రవేశించడం వాంఛనీయం. అంతేకాదు ఆనంద దాయకం కూడా. కవి కావడం అంటే - మనిషి మనీషి కానడమే; ఋషి కావడమే. ఋషి కృషి అంతా జగద్ధితం కోసమే కదా ! అందువల్ల ఎందరు కవులయింటే దేశంలో అంత జనహితం సిద్ధిస్తుందని నా విశ్వాసం. శ్రీ ఆకునూరు గోపాల కిషన్ రావుగారు 1995 నుంచి కవి కావడం వల్ల విశ్వశ్రేయస్సును ఆకాంక్షించి, జీవించే మరో దివ్యాంశ వెలిసిందని నా భావన.

ఈ కావ్యానికి పెట్టిన పేరు ''ఓంకార నాదాలు'' - ఎంతో శక్తిమంతం, మరెంతో అర్థవంతం. ఓం అంటే సర్వభూతాలను రక్షించేది అని అర్థం. ఓం అనే అక్షరమే ఓంకారం. ఓంకారానికి మరో పేరు ప్రణవం. ప్రణవం అంటే మిక్కిలి స్తోత్రం చేయడం అనీ లేదా మిక్కిలి స్తోత్రం చేయబడేది అని అర్థం. ఓంకారాన్ని బ్రహ్మాక్షర మని కూడా అంటారు. నాదం అంటే ధ్వని లేదా మ్రోత అని అర్థం. నాదం అనే పదంలోని నకారం ప్రాణవాచకం. దకారం అగ్ని వాచకం. ప్రాణాగ్ని సంయోగం చేత నాదం ఉదయిస్తుందని శార్ఙ్గదేవుడు సంగీత రత్నా కరంలో వివరించాడు. అగ్ని శక్తికి ప్రతీక. ప్రాణం (వాయువు) చైతన్యానికి ప్రతీక. ఈ రెంటికలయికే నాదం. అందుకే నాదానికి అంతటి మహిమ; అంతటి ప్రభావం. నాదం సంగీతానికి ప్రాణమై ఆపాత మధురమూ - ప్రపంచాన్ని పరవశింప జేస్తున్నది. మరి ఆనాదం ఓంకార నాదమై ప్రసరిస్తే అత్యంతామోఘం కదా ! ఓంకార వాచ్యుడు పరమాత్ముడు.

అకార ఉకార మకార సమ్మేళన స్వరూపం ఓంకారం. అకారం పరమాత్మ. ఉకారం ప్రకృతి. మకారం జీవాత్మ. అందువల్లనే ఈ కావ్యంలో ''సకలబలుడై''న

పరమాత్మను గూర్చిన ప్రకృతిని గూర్చిన, జీవాత్మను గూర్చిన కవితలు ముప్పేటగా అల్లుకొని ఉన్నాయి. మరో విధంగా చెప్పాలంటే ఈ కావ్యంలోని కవితలు మూడు రకాలుగా ఉన్నాయి - కవిగారి సొంత కవితలు, ఉర్దూ కవుల అనువాద కవితలు, హిందీ కవుల అనువాద కవితలు.

ఈ 'ఓంకార నాదాలు' కావ్యాన్ని కవిగారు తమలోని కవిని మేల్కొల్పిన మహా కవి ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి అంకితం చేయడం సమంజసంగా సముచితంగా ఉంది. 'నారాయణ' అనే మాటకు చక్కని అర్థాన్ని చూపింది అమర కోశం. "రాశ్శబ్దాః అయంతే నిర్గచ్ఛంతే యస్మాత్య నారాయణః నారాయణా దన్యః అరాయణః అరాయణో న-భవతీతి నారాయణః శబ్ద గమ్య ఇత్యర్థః - ఎవని వలన శబ్దములు బయలువెడలుచున్నవో అతడు రాయణుడు. రాయణుడు గానివాడు అరాయణుడు. అరాయణుడుగాని వాడు నారాయణుడు అనగా శబ్ద గమ్యుడనుట. రై శబ్దే."

ఈ 'నారాయణ' శబ్దార్థాన్ని ఇలా అన్వయించవచ్చు. కావ్య స్వీకర్త అయిన ఆచార్య నారాయణరెడ్డి గారి కారణంగా ఈ కావ్య కర్త కవి అయినాడు. ఈ కావ్యం కవిగారి భావాలకు శబ్ద రూపం. నారాయణుడు శబ్ద గమ్యుడు అయితే కావ్యకళా తపస్వి శబ్ద బ్రహ్మారాధకులైన నారాయణరెడ్డి గారు కావ్యగమ్యుడు కావడం సమంజసమే. అందులోనూ కావ్యం 'ఓంకార నాదాలు'. ఓంకార వాచ్యుడు పరమాత్ముడు. పరమాత్మ నుండి ప్రసరించి విశ్వ మంతా ప్రసరించేవి ఓంకార నాదాలు. అలాంటి 'ఓంకారనాదాలు' ప్రేమతో తనను చేరుకుంటు న్నప్పుడు నారాయణరెడ్డిగారు వాటికి స్వాగతం పలికి వాటిని స్వీకరించడం సముచితం, సహృదయ సమ్మతం.

ఈ కావ్యంలోని కవితలు ద్విపదలుగా సాగినాయి. కొన్ని ద్విపదలు కలిసి ఖండికలుగా రూపుదిద్దుకున్నాయి. ఈ ద్విపదలను తమదైన ఒకశైలిలో అంత్య ప్రాసతో వ్రాశారు కవిగారు. ప్రతిఖండిక చివరకు 'కవిగారు' అనే సంబోధనను వేకువలాగా, గజలు కవితల్లో చివరి పంక్తుల్లో లాగా ప్రయోగించారు.

ఈ 'ఓంకార నాదాలు' స్వచ్ఛందమైనవి. విలక్షణమైనవి.

'యతిప్రాస గణ సంధి సమాసగతి నియమములేవీలేని అతి విలక్షణమైన నాదాలివి అరమరిక లేక ఆలకించిరేని" అనీ, సృష్టిలోని "పూలు పూబోళ్లు నెమళ్లు మాకంధ ఫలాలు

ససేమిరా వీటికే మాత్రం తీసిపోనివి సుమా కవిగారి ఓంకార నాదాలు" అనీ - కవిగారే చెప్పుకున్నారు. ఇవి అచ్చమైన సత్యానికి ఆమ్రేడితాలు.

ఈ కావ్యదర్శనంలో ఈ కవిగారి వ్యక్తిత్వం చక్కగా కనిపిస్తున్నది. వారు ఆశావాది. మానవతా వికాసాభిలాషి. శాంతిప్రియులు. తోటివారిలో ఆనందాలు తొణికించాలనీ, ప్రతివాడు సమాజానికి పనికి వచ్చే ఒక మంచి పని చేయాలనీ ఆకాంక్షించే సుహృదయులు. మంచి ఎక్కడున్నా తలవంచి ఆదరించే సచ్ఛీలురు. స్నేహ వృక్షాలను పెంచి కాపట్య కాలుష్యాన్ని తుడిచేద్దామనే సుమనస్వి. పిడుగుపడ్డ చప్పుడు వినగానే పిచ్చుక గూళ్లే జ్ఞాపకానికి వస్తాయి ఈ కవికి. పేదల పట్ల దీనుల పట్ల అంతటి దయ, సానుభూతి ఈ కవికి. కవిగారి వ్యక్తిత్వంతోపాటు ఈనాటి మనదేశ సమాజ స్థితిగతులు కూడా ఈ కావ్యంలో ప్రతిఫలిస్తున్నాయి. 'జన్మ భూమి' కార్యక్రమం అధికార భాషా ప్రాధాన్యం హింసా దౌర్జన్యాల ఆధిక్యం, పేదల దుఃస్థితి, చందన చౌర్యకళా వీరుడైన వీరప్పన్ దుశ్చేష్టలు, సంస్కృత భాషా ప్రాశస్త్యం ఇలా - అనేక విషయాలను గూర్చిన కవిదృక్పథం ఈ 'ఓంకార నాదాలు' లో దర్శించవచ్చు. తెల్గు గజలు ''ఆంధ్ర మహాకవి దాశరథి అందించిన నజరానా తెలుగు తల్లికి'' అని దాశరథి మహాకవిని సంస్మరించడం సముచితంగా ఉంది.

ఈ కావ్యంలోని -

''మంచి మరీక్షణకాలం చెడు మాత్రం చిరకాలం''

''ఓపిక బ్రదుకుకు ఓషాక్ అబ్జర్వర్ లాంటిది''

''అనురాగం అనే భాష అందరి కంతటా అర్థమయ్యేది''

''ఫిలమెంటు బాగున్నంతసేపే బల్బు తాను వెలగడం'' - వంటి ఎన్నో చక్కని సూక్తి మౌక్తికాలు ఈ కవిగారి అనుభవ సముద్రంలో నుంచి వెలువడ్డవే.

అందినట్లే ఉండి అందని అనంతం లాంటిది కవిత్వం. ఎంత దూరం పయనించినా కొంతే అవుతుంది. ఎంత తాగినా కవిత్వం ''తీరని దాహం''.

'పురోగమనానికనే ముందు చూపిచ్చె సకలబులుడు'' - అని తెలిసిన కవి గారు కలంపట్టి ఇంకా ముందు ముందు శబ్ద బ్రహ్మను గూర్చి తపస్సు చేసి ప్రజలు 'వహ్వా' అని మెచ్చేలా 'ఇంగులకైతలు' సృజించి తెలుగువాణిని అలంకరించాలని ఆశిస్తూ కవిగారికి నా శుభకాంక్షలందజేస్తున్నాను.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

16-12-2000

8-73, గౌతం నగర్,

దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500 060.

# కవిగారూ ! పేరు సార్థకం చేసుకున్నారు

మీ 'ఓంకార నాదాలు' ఏ అహంకారమూ లేకుండా ఆది నుంచి అంతం దాకా చదివారు. ఈ ప్రయాణం, ఆయాసమేమీ లేకుండా జరిగింది. ఇక మిగిలింది నాకు మిగిలిన అభిప్రాయాలను మీకు అక్షరాలా రాయడం. అందుకే కూచున్నాను. ఒక కవి రాసిన దాన్ని దేన్నయినా చదవాలంటే ఆ కవితో అంతో ఇంతో పరిచయం ఉండటం వల్ల అంచనా వేసుకునే వీలు ఉంటుంది. అనుకోకుండా మనం నాలుగేళ్ల కిందట డా॥ పోతకూచి సాంబశివరావు గారింట్లో కలుసుకున్నాం. అప్పుడు మీ 'నామం', 'రూపం' తెలుసుకున్నాను. ఇప్పుడు మీ గ్రంథాలు ఒక్కొక్కటే చూస్తుంటే నాకు మీ 'భావం' కూడా కంటి కానుతోంది. ఈ జన్మ నెలా సార్థకం చేసుకోవాలనే ప్రయత్నంలో మీ నుంచి మాటలు మనసులోంచి పొంగి పొర్లుతున్నాయి. పొంగి పొర్లేదాన్ని నేలపాలు కాకుండా పంటలకు పంచుతున్నారు మీరు. దాని వల్ల మీ హృదయ వాతావరణం కాలుష్యం లేకుండా పచ్చగా పైరగాలిలో కవిత్వంలా ఊగిసలాడుతోంది. దాన్ని భద్రంగా అందరికీ పంచాలనే తలంపులో మీ జన్మ సార్థకమవుతుందనడంలో సందేహం లేదు.

- మీరు భావాలు చెప్పే పద్ధతిలో ఒక రహస్యం ఉంది. మీరు ప్రేమించే ఉర్దూ సాహిత్యంలోంచి వచ్చిందది. ఉర్దూ కవులకు ప్రేమ తత్వం ప్రాణధార. మనస్సులోనే వారు పరమాత్మను చూసుకుంటారు. దాని జోలికి ఎవరు వచ్చినా సహించరు. మీరు అనువాదం చేసిన గజల్ల ద్వారానే నాకీ సంగతి తెలిసింది. మీ గజల్లలో ఒకచోట కనిపించిన భావం నన్ను బంధించింది.

  "పూలు త్రుంచడం తప్పదు. తప్పదు చెట్లు నరకడం

  మనసు మాత్రం త్రుంచ వద్దది సకలబలుని ఆలయం". (P 14) మనస్సుని సకలబలుని ఆలయంగా నివాసంగా భావించడంలో అద్భుతత్వమే ఉంది. అది తిరగబడితే ప్రకృతే ఆగదు కదా. చెట్లు మళ్ళీ పుట్టవు. పూలు పూయవు. కాని పూజించడానికి దాన్నుంచి పూలు కోయవచ్చు. దారికి అంతరాయం వస్తే చెట్లను

నరకవచ్చు. కాని మనసునే ట్రుం చేస్తే శరీరబలమంతా ఎదురు తిరుగుతుంది. హింసలన్నీ మనస్సుకు హింస కలిగినపుడే ఎదురవుతాయి.

- మీ కవిత్వంలోని మరో కోణం గురించి చెబుతాను. పెద్ద సిటీ లాగా కాకుండా నిర్దష్టమైన ఋషిపల్లెలాగుంటుంది మీ రచనంతా. కవిత్వ శాస్త్రాల కసరత్తులు చేయకుండా మనస్సుకు మాట అందించాలని చూస్తుంది మీ వాణి. ఉదాహరణకు ''పదో పాతికో అడుగులే మనతో ఎవ్వరైనా (కలిసి) వచ్చేది ! జీవితాంతమూ మనతో మనమే కదా కలిసి నడిచేది.'' (P 21)

- మీ భావధారలో నిత్యానిత్య విచారణ ఒకటి చోటు చేసుకుంటూ ఉంటుంది. ఇలాంటి చోటు ఓంకార తత్త్వం కనిపిస్తుంది. ఓంకారమంటే సృష్టి స్థితి లయాల క్రమ విన్యాస త్రిపుటి. చూద్దాం ఓ ఉదాహరణ.

  ''ఎంత ఆపి పెడతామో కవిగారూ అంతగానే దరిద్రులము ఎంత పంచిపెడతామో అంతకంత ధనవంతులము'' (P 22) లోభ గుణం మీద బ్రహ్మాస్త్రమని ఎంతమందికి తెలుస్తుందో ఇది ?

- ధనస్వామ్యం ఈనాడు వేస్తున్న వెర్రివేషాలనూ ల్జరీలనూ లజ్జారాహిత్యాన్ని చూసి మీరు రాసిన పంక్తుల్లాగున్నాయి. ఈ గజలు పాదాలు రెండూను.

  డబ్బు కొనలేని వెన్నెన్నో దండిగ (ఉన్నాయని) వాటిని తెలుసుకో.
  అపుడు నీవు కోటీశ్వరుడవయినా అర్థం లేదని తెలుసుకో !

  ఇంతసూటిగా చెప్పడం గజలు పద్ధతి అని తెలుసుకోకపోతే దీనిలో కవిత్వం లేదని సూక్తి ఉందనీ గడుసువాళ్లు అనుకోవచ్చు. దానికేం, కవి కమిట్మెంటుకి గజలు భగవద్గీతే.

- మీ గజళ్లలో (మీ గజలును ఓంకారనాదం అన్నారు) కొన్నిచోట్ల ఆ రెండు పాదాలలోనే కథానికలు కనిపిస్తాయి.. అది చిత్రమే.

  ''పోనీ లేవే బాధపడకు అద్దమే కదా పగలగొట్టింది.
  ఎందరు నిత్యం ఇతరుల గుండెల్ని పగల గొట్టడం లేదూ ? (P 36)
  ఎవరి మధ్య ఈ మాటలు దొర్లాయో చెప్పాలా?

- మీ ఓంకార నాదాల్లో కార్టూన్ చిత్రాలున్నాయని అంటే మన వాళ్లు క్యా హై అంటారేమో ? చూపిస్తాను.

"వ్యాపారమదియొక తోపుడు బండి లాంటిది.
తోస్తుంటేనే తప్ప తప్పక అది (తోవలో) ఆగిపోతుంటుంది.

- కవి కసలు వైరాగ్యముండ కూడదనే వారు ఈ నాడెందరో ఉన్నారు. కానీ కవికి ఎలాంటి వైరాగ్యం ఉండాలో చెప్పలేరు. మీరు చెప్పేశారు.

అర్థిస్తే సకలబలుడు అన్నీ ఇస్తాడని కదా విన్నా.
ఒకనాడిక నిన్నమ్మని అడిగేద్దామనుకున్నా (P 48). ఇందులో వాచ్యాన్ని మించి వ్యంగ్యం ఆత్మాశ్రయంగా వస్తే. వేదాంతమే. అన్యాశ్రయంగా అయితే చార్వాకం. గజల్ ఆత్మాశ్రయమే అవుతుంది కదా ?

- వర్తమాన సాంఘిక వక్రగతులను వేలెత్తి చూపడానికి మీ గజలు సమయస్ఫూర్తి చూపిస్తోంది.

"కొడుకులు తల్లిదండ్రుల కొండంత బంగారాలు
కొడుకులకో మాతాపితరులు కోడళ్ళు రాగానే శత్రువులు"

- గజలును గగనంలో ఉంచకుండా కిందికి దింపి పిల్లలకు కూడా చెప్పే పద్ధతిలోకి మలిచారు మరొకచోట. నిజానికిదొక తమాషా ఆటవిడుపు గజలు.

ముట్టుకుంటే కాల్చేది నిప్పు పట్టుకుంటే కూల్చేది అప్పు
కొత్తదైతే కరిచేది చెప్పు ! ఏమైనా చేయకూడంది తప్పు !

- కవిగారూ ! అందరికీ అన్నీ నచ్చవని మనం మెచ్చింది, మనకు నచ్చే రీతిలో చెప్పకుండా ఉంటామా. ఎవరి కేది కావలిసిస్తే దాన్ని వెదక్కోడానికి మీ ఓంకార నాదాలు 'సాగి' పోయాయి. ప్రయాణం చేయకుండా ఉండటం కన్నా ప్రయాణం చేస్తూ పోవడమే ఓంకారాల పరమావధి. అంతేకదా ?

● దాశరథి గాలిబ్ గీతాలు వచ్చాకనే గజల్లను గురించి తెలుసుకున్నారు తెలుగువాళ్ళు. సినారె దానికి గొప్ప వ్యాప్తి కలిగించారు. కొత్త ప్రయోగాలు చేశారు. పాడారు. పాడించారు. అయితే ఉర్దూలో ఉన్న గజలు కవులను శతాధికంగా తెలుగువారికి పరిచయం చేస్తున్నది మీరే ననుకుంటాను. గజల్లను అనువదించడానికి మీరు పూనుకోవడం తెలుగులోకి కొత్తకవులను ఆహ్వానించడమే - వర్తమానంలో తెలుగు కవిత్వం ఎలాగుందో మీకు తెలుసు. మీ అనువాద కవితలు మీ గొంతులో తెలుగుతనం నేర్చుకున్నాయి.

'శవం గుర్తు పట్టే వీలౌతుందని ఓ ఫోటో మేము జేబులో పెట్టుకుని ప్రతిరోజూ బయలుదేరతాం !'' (P 120)

అన్న కవి బల్బీర్‌సింగ్ అనే ఉర్దూ కవి. మీ అనువాదంలో చూసి హైదరాబాదు సిటీనెంత వాస్తవంగా చిత్రించారీ కవి అని నిర్ఘాంతపోయాను. నాకు ఉర్దూ రాదు.

మొన్నటి పుట్టు బీద నేడు మహానాయకుడైనాడు
రాముడని అందరుకున్న వాడు రావణుడైపోయాడు ! (P 125)

ఉమాశ్రీ ఇలా రాశారా ? ఎంత సులువుగా నిజం చెప్పొచ్చో గజల్‌తో ఇంతకన్నా ప్రజాకవిత్వం ఎలా ఉంటుంది ?

ఆ కవులు మీకు ఋణపడి ఉంటారు. వాళ్లను పరిచయం చేసినందుకు మాలాంటి వాళ్లం కూడా మీకు ఋణపడి ఉంటాం.

నా కాగితం నాకలం ద్వారా నన్ను హెచ్చరిస్తోంది.
''బాగానే రాశావులే కానీ జాగా అయిపోయింది !

ఇంకేం రాయనూ ?

భాషా ప్రవీణ డా|| మిర్యాల రామకృష్ణ
M.A., Ph.D.

113, వెన్నెల
తారాపద నగర్, కాకినాడ.
14-12-2000

# మురిపించే ముక్తకాలు

తెలుగు సాహిత్యానికి మధురమైన గజల్ అనువాదాలను అందించిన కవి దాశరధి అయితే, మౌలికమైన గజల్ రచన చేసిన కవి సినారె. ఉర్దూ సాహిత్యంలో ప్రణయ విరహాలతో ప్రారంభమై తాత్విక ధార్మికతలను సంతరించుకొని, సామాజిక విమర్శ దిశగా ప్రయాణించిన సొగసైన కవితాప్రక్రియ గజల్. అనుభూతి సాంద్రమై అమేయమైన భావసౌందర్యంతో హృదయాన్ని తాకే వేలాది గజళ్ళను గాలిబ్, మీర్, దర్ద్, సౌదా, మోమిన్, ఫైజ్, ఫిరాఖ్ గోరఖ్‌పూరీ మొదలైన కవులు అందించారు.

ప్రస్తుతం ఉత్తర దక్షిణ భారతదేశాల్లో గజల్ వ్రాసే వారి సంఖ్య పెరిగింది. హైదరాబాదులోని ఉర్దూ కవుల గజళ్లు అనువాదిస్తూ తను స్వయంగా గజల్స్ రాస్తున్న వారిలో కవిగారు ఒకరు. కవిగారి ఈ తాజా పుస్తకం 'ఓంకార నాదాలు' భావంలో గజల్‌ని పోలినా ప్రక్రియగా వారీ ద్విపదలను "నాదాలు" అనే పేరుతో ప్రకటిస్తున్నారు.

ఈ పుస్తకంలో కవిగారి స్వీయకవితలతో పాటు సమకాలీన ఉర్దూ హిందీ కవుల కవితల అనువాదాలు చోటు చేసుకున్నాయి. వీటిలో వస్తువైవిధ్యం ఉంది. ప్రణయం, దయ భగవద్భక్తి, మానవత, దేశభక్తి, నిస్వార్థం, న్యాయం, ఉపకార చింతన, సమాజ పరిస్థితులు వంటి అనేకానేక విషయాల నుంచి చివరకు ఎయిడ్స్ జూలో పులిహత్య, వీరప్పన్‌ల వరకు అన్ని కవితా వస్తువులున్నాయి.

కవిగారి శైలి, భాష, భావం కూడా సరళమైనవి. సంక్షిప్తత, అస్పష్టత కవిత్వంలో మృగ్యం. ఆధునిక కవితా లక్షణాల్లో కొన్ని కవిగారి కవితల్లోనూ అక్కడక్కడా ధ్వనిస్తాయి. తన ఇంట్లో తనే పరాయి అయిపోయిన భావనను స్ఫురింప చేస్తూ

'అతిథిని నేనే నా ఇంట్లో అనిపిస్తుందపుడపుడు
అంతా ఎదిరి చూస్తారు పోదునో నేనని ఎపుడెపుడు!'

కవిగారి భావనలో చమత్కారం ఉంది. తూట్లు పడ్డ తన హృదయాన్ని వంట ఇంట్లో వాడుకొమ్మని గృహిణులకు ఇలా చెప్పారు.

'జల్లెడలా మనసొక్కటి చిల్లులు పడ్డదున్నది
ఇల్లాళ్లూ కావాలా మీకెంతగానో పనికొస్తది !

ఇందులో కవితలన్నీ ముక్తకాలే. పాఠకుడిని ఒక 'మూడ్'లో నిలపడానికి కవి యే ప్రయత్నమూ చేయలేదు. దేనికది-ఈ ద్విపద స్వయం సమగ్రమై వేర్వేరు అనుభూతులను పంచుతుంది. ఇది పూర్తిగా గజలు పోకడ. గాంభీర్యం నుండి ఎత్తిపొడుపుకూ, ఎత్తిపొడుపు నుంచి 'సకల బలుడి' ఆరాధనకూ, దైవారాధన నుండి సమాజ నిరసనకూ చరచరా పారిపోతుంది. కవిగారి 'మూడ్' మచ్చుకి-

'వాడి గూర్చి మాట్లాడితివా వాడు నిన్ను వదలడు
నీ గురించి మొదలిడితివా వాడు లేచి వెళ్తాడు !'

చక్కని స్వభావ పరిశీలన, అధిక్షేపం ఉన్న ఈ కవిత తర్వాత,

''జానకీ వసుదేవుడు యశోదానందుడు
నల్గురి తపఃఫలమే కవిగారూ నల్లనయ్య కృష్ణుడు !'' అన్న కవితా వైవిధ్యం.

ముక్తకం వంటి కవితలకు పరస్పర సంబంధం ఉండనవసరం లేదుగానీ ఒక మూడ్‌కు చెందిన కవితల్ని ఒక చోట కూర్చితే గజలు స్వభావం కనపడదనేమో ఇలా నడిపారు.

మనిషిలో నిజాయితీని, పశ్చాత్తాపాన్ని, దయార్ద్ర హృదయాన్ని, దైవభక్తిని, ఆత్మస్థైర్యాన్ని, ఆశావాదాన్ని ఈ కవి ప్రేమిస్తారు. ఇందుకు ఈ సంకలనంలో ఎన్నెన్నో ఉదాహరణలు లభిస్తాయి. మచ్చుకి ఒకటి -

'కన్నీరందరి కళ్లలోను ఒకటే చూడు
అవెక్కడ చూసినా గానీ నీవేనని తుడు !'

ఈ సంకలనం రెండువ భాగంలో 60 మంది ఉర్దూ కవులు 17 మంది హిందీ కవుల కవితానువాదాలున్నాయి. అవి ఆయా కవుల కవితా హృదయాలకు దర్పణం పట్టాయి. కొందరు సమకాలీన హిందీ కవుల గజళ్లను కూడా పరిచయం చేసినందుకు కవిగారు అభినందనీయులు.

సయీద్ షహీదీ గజల్‌ను తెలుగులో పాడుకోవడానికి కూడా వీలుగా చక్కటి అనువాదం చేశారు. ఈ సౌలభ్యం సర్వత్రా ద్యోతకం.

"ఎపుడు చితికి పోయానో ఎపుడెపుడని చెప్పను
ఎవరీ స్థితికిడ్చారో ఎవరెవరని చెప్పను !"

"సంతసాలు నాకన్నీ చింతలే తామయ్యెను
చింతలలోని చేదు మజా ఎంతెంతని చెప్పను !"

ఇలా అనువాదం అంతా సరళసుందరంగా సాగింది.

ఇంతవరకు ఉర్దూ సాహిత్య ప్రక్రియలను పరిచయం చేస్తూ వచ్చిన కవిగారు ఇపుడు తానే 'నాదాలు' అనే ఛందోనియమ రహితమైన కవితా ప్రక్రియను ప్రయోగాత్మకంగా ప్రారంభించారు. వారికి నా అభినందనలు.

మృణాళిని
ఆంధ్రోపన్యాసకులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము
నాంపల్లి, హైదరాబాదు

11-12-2000

# కదంబమాల

''ఓం, ఓం, ఓం, అనరా
ఓంకారంబె ప్రణవమురా
ప్రణవ నాదమే బ్రహ్మమురా
బ్రహ్మానందమే పొందుమురా''

అన్నారొక మధుర భక్తి కవి. కవిగారు వ్రాసిన ఈ ఓంకార నాదాలు గ్రంథం చదివి, బ్రహ్మానందం పొందక తప్పదు.

ఈ ఆనందాన్ని చదువరులకు, కలిగించటానికి కవి పడే తపన, బాధ, వేదన, అంతా ఇంతా కాదు. వేదన, ఆవేదనలో నుండే విశిష్టమైన కవిత వెలువడుతుంది. ఈ ఆవేదన కవి హృదయసాగరాన్ని చిలుకుతుంది. సాగర మథనంలో నుండి, అమృతం పుట్టినట్లే, కవి హృదయ వేదన నుండే అనేక ఆణిముత్యాలలాంటి కవితలు పుట్టి, అవి ప్రజా బాహుళ్యానికి సందేశాలను ఇచ్చి, వారికి జీవిత సత్యాలను తెలుపుతాయి.

కవిగారు నేటి సాహితీ రంగంలో తనదంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొన్నారు. తన స్వతంత్ర భావాలతో, తన స్వంత బాణీలలోనే ద్విపద రూపంలో ఈ కావ్యాన్ని రచించారు. ఈ ఓంకార నాదాలు, చదువుతుంటే, సరళమైన భాషలో సామాన్యుడికి కూడా వేదాంతం అర్థమవుతుంది. మచ్చుకు

''భగవత్సంకల్పమన్నది భళారే తిరుగులేనిది
కావాలంటే కల్గనిది వద్దనుకుంటే కాదు మానేది''

అలాగే ఇంకొక్క మచ్చు తునక

''ఇతరులను జయించడమేమంత గొప్పకాదు
తనను తాను జయించడం కన్న గొప్ప ఏదీ లేదు !''

కవిగారు ఈ గ్రంథంలో - భక్తి, ముక్తి, దయ, స్నేహం, దైవం, వేదనమొదలగు అంశాలను వస్తువుగా తీసుకుని, పాఠకులకు క్రొంగ్రొత్త అనుభూతులను వీటిపై కలిగించారు.

ఓంకార నాదాలు రెండవ భాగంలో 60 మంది ఉర్దూ కవుల 17 మంది హిందీ కవుల కవితల అనువాదాలు ఉన్నాయి. అనువాదం చేయటంలో కవిగారికి కవిగారే సాటి. గాలిబ్ గజళ్ళను, అవలీలగా అలవోకగా ''గజల్ సుందరి'' కావ్యంగా రూపొందించారు. ఇంకా 125 మంది కవులు వ్రాసిన కవితలను తెలుగు వారికి తెలియపరిచి, తన ఉర్దూ పాండిత్యాన్ని ఇదివరకే చాటుకున్నారు.

ఇప్పుడు ఈ గ్రంథంలో మచ్చుకు - అలీం పర్వాజ్, కరీంనగర్ గారి గజల్‌కు కవిగారి అనువాదం చూడండి

''అవసరాలు తీరిస్తేనే ఆహా మా దేవుడంటారు
అవి తీరని నాడో ఆయనను తలవనే తలవరు''

మరొక మచ్చు తునక

''నాల్కను నీ అధీన మందుంచుకో షేఖ్
తూచి తూచి మాట్లాడు తోచినదెల్లా పలుకకు''

కవిగారు వ్రాసిన ఈ ఓంకార నాదాలు ఒక 'కదంబమాల' అనవచ్చు. కదంబమాలలో అనేకరకాల పువ్వులను మల్లె, జాజి, మరువం, కనకాంబరాలు ఒక మాలగా కూర్చి కడతాము. ఈ మాల మన కనులకింపు చేసి మనసును తన పరిమళాల జల్లులతో ఆనంద పరచి తనను భగవంతునికి సమర్పించమని ఆదేశిస్తుంది.

కవిగారి ఈ గ్రంథం ఓంకార నాదాలను వినిపించి చదువరులను ఆనందపరిచి, వాటిలోని సత్యాలను గ్రహించేట్లు చేయాలని నా ఆకాంక్ష.

''విశ్వమునకు శ్రేయస్సు గూర్చేదే కావ్యం''.

కవిగారు, విశ్వ కల్యాణానికి వ్రాసిన ఈ కావ్యం ప్రజాదరణ పొందాలని కోరుతూ, సాహితీ జగత్తుకు అతి తక్కువ వ్యవధిలో ఈ ఏడవ కావ్యం అందిస్తున్నందుకు, అభినందలు తెలుపుతున్నాను.

చివరగా వారి శ్రీమతిగా కవిగారు ఈ సాహితీ క్షేత్రంలో ఇంకా ఎన్నో ఆణిముత్యాలాంటి కావ్యాలు పండించాలని పాఠక లోకం వాటిని చదివి ఆనందించాలని కోరుతున్నాను. మరి ఇక కవిగారి ''ఓంకార నాదాలు'' చదివి వీనులవిందు చేసుకుందామా !

బహుకళాకోవిద, ఉపన్యాసధురీణ, విద్యారత్న, ఉపాధ్యాయరత్న
శ్రీమతి డా॥ ఆకునూరు స్వర్ణలత
M.A., M.Ed., Ph.D.

13-11-2000

# అసాధారణ కవిగారు

పరిచితులందరికీ ఆయన అసలు పేరు కన్నా 'కవిగారు' అంటేనే తెలుస్తుంది. కవిగారిలో మనల్ని ఆకర్షించే మౌలిక లక్షణం 'చైతన్యం'. వ్యక్తిగా వారితో కాసేపు మాట్లాడినా ప్రవాహ సదృశమైన ఆయన మాటలు మనల్ని నిరుత్తరుల్ని చేస్తాయి. నిత్య సాహిత్య చింతనలో నిరంతరం నిమగ్నుడయి ఉంటాడాయన. ఈ కాలానికి ఒదగని మరొక విలక్షణ గుణం ఆయనలో మనకు కనిపించేది 'స్వేచ్ఛ'. ప్రాచీను లకు బలమైన నమ్మకాలుండేవి. ఆ బలీయ ప్రాచీన విశ్వాసాలు ఆధునికులయిన కవిగారిలో ఉన్నాయి. వివిధ భాషల్లో ఆయన నిష్ణాతుడు. అసంఖ్యాక ఉర్దూకవుల్ని ఆంధ్రులకి పరిచయం చేసిన భావుకుడు. ఉర్దూ కవిత్వం పట్ల ఆయన ప్రేమ వల్ల ఆయన కవితలకు భాషకు, భావాలకు ఒక మార్దవ గుణం వచ్చింది. వేదాల పరిచయం, ఉపనిషత్తుల అధ్యయన అనువాదాల వల్ల ఆయనకొక తాత్విక స్పర్శ కలిగింది.

లయాత్మకమయిన ద్విపదల్లాంటివీ 'నాదాలు'. వీటికి కవిగారు ఓంకార నాదాలు అని పేరు పెట్టారు. దైవానికి 'సకల బలుడ'ని ఎప్పుడో నామకరణం చేశారు కవిగారు.

'పోతనగారు' పలికెడిది భాగవతమట పలికించెడువాడు రామభద్రుండట, నే పలికిన భవహరమగునట, పలికెద వేరొండు గాథ పలుకగనేల' అన్నారు. కవిగారిలోనూ అదే దృష్టి కానీ దైవ లీలలో మనోహరమైన సృష్టి అందాలలో తనవీ వాటితో ఏ మాత్రం తీసిపోనివని ఆత్మవిశ్వాసంతో చెబుతారు.

''సకలబలుని సృష్ట్యందాలు పూలూ, పూబోళ్ళు నెమళ్ళు మాకందఫలాలు
నేమిరా వీటికే మాత్రం తీసిపోనివి సుమా' కవిగారి ఓంకార నాదాలు'' అంటారు.

అభివ్యక్తిలో కవిగారిది ప్రత్యేకమైన ధోరణి. నిజాయితీ ఆయన సొత్తు. ఆయన కవిత్వాన్ని ఆస్వాదించడానికి ఆయన తత్వం మొదట మనం అర్థం చేసుకోవాలి. దానికి ఆయనే మార్గం చెబుతాడు.

''పనులన్నీ ఆత్మతో చేయడం పద్ధతి నాది సుమండి
అప్పుడందులో తప్పులు అతి తక్కువ చూడండి''

తక్షణ స్పందన అన్నది కవిగారి లక్షణం. కాబట్టే తన అనుభవాల్ని, ఊహాల్ని బాణాల్లా వొదుల్తారు.

''సునాయస జీవితం కఠిన శ్రమా ఫలితం
అనాయాస మరణమే అందరికీ అవసరం''

వంటి జీవిత సత్యాల్ని అనాయసంగా పలుకుతారు. కవిగారు జీవన విషాద రహస్యం తెలిసినవారు.

''ఏ మనిషీ ఎప్పుడూ జీవితంలో 'ఏకాంతుడు కాడు
ఏదో ఓ సమస్యెప్పుడూ నీడై ఉంటూ ఏడ్పించెడు.''

కానీ ఇంత జీవనోత్సాహం ఉన్న కవి ఖచ్చితంగా ఆంధ్రదేశంలో లేడు అందుకే ఆయన

''తోటి వారిలో ఆనందాలు తొణికించిన కొన్ని క్షణాలే
మనిషి జీవితంలో కవిగారూ మహితమైన క్షణాలు'' అంటారు.

కవిగారి కవిత్వం చదివినా వారితో మాట్లాడినా మనకు జీవితం పట్ల గొప్ప ప్రేమ ఏర్పడుతుంది. నమ్మకం కలుగుతుంది.

కవిగారికి మొహమాటం ఉండదు. కవిత్వంలోనైనా వ్యక్తిగా నైనా ఇతర్ల ఇష్టాయిష్టాలకు మెరమెచ్చుల కోసం కాకుండా

''నాకు నచ్చని ఒక వాక్యాన్నీ నేను ససేమిరా వ్రాయను
ఇతరులు వీట్నీ మెచ్చుకుంటే అహో - నేనేం చేయను'' అంటారు.

ఇట్లాంటి అభిప్రాయాలు, అనుభూతులు ఓంకార నాదాల్లో ఉన్నాయి. ఈ నాదాలలో ఉర్దూ కవుల అనువాదాలూ ఉన్నాయి.

కులీకుతుబ్‌షా మొదలు అరవైమంది ఉర్దూ కవుల 17 మంది హిందీ కవుల గజల్స్ ఉన్నాయి. ఇప్పటికే 'గజలు సుందరి' ద్వారా ఆయన సుప్రసిద్ధుడు. ఉర్దూ కవిత్వాన్ని దాశరధి తర్వాత తెలుగు వాళ్ళకు విశేషంగా పరిచయం చేసిన ఘనత కవిగారిదే. మహాోష్ బానూ అహ్మద్ అన్న పాకిస్థాన్ గజల్ కవయిత్రి గజల్‌ని అనువదించిన తీరు చూస్తే కవిగారు ఎంత గొప్ప అనుసృజనకారులో తెలుస్తుంది.

''జీవితమో నిండిన మధుకలశం
గడచిన క్షణాల శోకగీతికలా

ఒలుకుతూ ఒదుగుతూ గడుస్తుంది.
జీవతమో ఎడతెగని ఆశల కెరటం
సుఖదుఃఖాల ఒడి అనే పడవలా
పైకీ క్రిందకూగుతూ మంద్రంగా నడుస్తుంది.

జీవితమో సకల బలుని అనుగ్రహం
చింతా చీకాకులమయమయి చివరకు
అనుభవాల సారంలా అది ముగుస్తుంది.

బహుముఖ ప్రజ్ఞాశాలి ఐన కవిగారి పుస్తకాల పరంపరలో ఈ 'ఓంకార నాదాలు' కవిగారి అంతరంగాన్ని, ఆలోచనా తరంగాల్ని మనకు అందిస్తాయి.

207 అమృతా ఎంక్లేవ్ — సౌభాగ్య
రోడ్ నెం. 14, బంజారా హిల్స్, హైదరాబాద్ — 30-11-2000

# అద్వితీయం

'మానవత' పరిమళిస్తున్న మహాకవి విశేషకీర్తి ప్రభా భాసితులు "సినారె"కు అంకితమిస్తున్న కవితాకృతి ఈ ఓంకార నాదాలు. "ఓంకార నాదాలు" వినిపిస్తున్న కవిగారు ఆకునూరు గోపాల కిషన్ రావుగారు ఇప్పటికే తనదంటూ ఒక స్థానాన్ని, విశిష్టతను సాధించారు. 'సినారె' గజళ్లు తనకు ప్రేరణ అని కవిగారి అభిప్రాయం. ఆమాట "అక్షరాల సత్యం" అని ఈ కావ్యం నిరూపిస్తుంది.

భారతీయ భాషలలో "ఉర్దూ" భాషకు ప్రాధాన్యత ఉంది. 'గజల్' ఉర్దూ భాషలోని ఉత్తమ కవితా ప్రక్రియ. దాన్ని తెలుగు వారు, తెలుగు కవులు ప్రాచుర్యంలోకి తెచ్చారు. అన్యభాషల ప్రభావముతో 'ఆంధ్రకవిత' అడుగు ముందుకు వేస్తున్నది. కీ. శే. దాశరథి గారు ఉర్దూ కవి 'గాలిబ్ గజళ్ల'ను తెనిగించిన విషయం అందరికి తెలిసినదే ! ఈ కృతిని చదివినప్పుడు మనకు దాశరథి "గాలిబ్ గీతాలు" గుర్తుకు వస్తాయి.

ప్రతి కవికి భావనా బలం, భాషా బలం అవసరం. వ్యక్తీకరించేశైలిలో సరళత, స్పష్టత, సంక్షిప్తత అనివార్యం. ఈ లక్షణాలన్నీ ఈ కావ్యంలో మనకు దర్శనమిస్తాయి. 'జీవితం' మన ఎదుటే ఉన్నట్లు కనబడుతుంది. సమాజం దర్పణంలా ప్రతిబింబిస్తుంది. ప్రగాఢ ఆత్మ విశ్వాసం భగవంతుని పేరున "మహాబలుడు"గా కలాన్ని నడిపిస్తుంది. మనందరికి అనుపమ భావాలను పంచుతుంది. ఉర్దూ సాహిత్య పరిచయముతో "ఆంధ్రత్వం" నర్తిస్తున్న కవితాకావ్యం "ఓంకార నాదాలు" కవిగారి ధార్మిక చింతన, వేదాల జ్ఞానం ఈ కావ్యాన్ని సుసంపన్నం చేశాయి.

కావ్యంలోని ఈ చరణాలు చూడండి ఇలాంటి వాచ్యమనోహరమైన వాక్కులు ప్రతిపుటలో అలరిస్తున్నాయి. కవిగారు పరుగులిడే జీవనది లాంటి వాడు. ఆధార అనంతంగా కొనసాగుతూనే ఉండాలి.

''రాత్రి మాట నేనెరుగును, రాత్రి వెళ్లిపోయింది.
ఉదయమా ! నీవు చెప్పు రాత్రి ఎచటికెళ్లింది ?''

''అన్వేషణ''లో ప్రయాణానికి అంతమదెక్కడిది ?
అడుగడుగున గమ్యం అదిగదిగో అనిపిస్తుంది ?''

''నారా చంద్రబాబు నాయుడు మన సీయం
రేరాజుగ, చల్లగ ఈ రాష్ట్రాన్నేలుట నిజం''

'మంచి కవిత' తన్ను తానే రికమెండ్ చేసుకుంటుంది అన్నారు శ్రీశ్రీ. ఆమాట ఈ కావ్యం చూశాక నిజమనిపిస్తుంది. నిరంతర కవితాన్వేషి అందించిన ఓ మధుర అద్వితీయ కావ్యం ''ఓంకార నాదాలు'' అని అనిపిస్తుంది. ప్రజాకవి వేమన నిక్కమైన మంచి నీలమొక్కటి చాలునన్నట్లు ఈ పుస్తకం సంతృప్తి నిస్తుంది ఇదే కవిగారికి నా అభినందన.

**ఎస్. వెంకటరంగారెడ్డి**

ఫ్లాట్ నెం. 306, లలితాజ్యోతి అపార్ట్‌మెంట్స్
కూరగాయల మార్కెట్ దగ్గర,
నల్లకుంట, హైదరాబాదు - 44.
26-11-2000

# హృదయ నాదాలు

ఆకునూరు గోపాలకిషన్ రావుగారి ఓంకార నాదాలు చదివాను. వారి కవిత్వం చదువుతుంటే శరీరం పులకించింది. మనసు ఆనందతరంగాలలో ఓలలాడింది.

'అంత కడివెడు పాలపై
ఒక్కింత మీగడ పేరినట్లు'

'గతంలోని మంచి' అదియే మన సంప్రదాయం - అన్నారు సినారె. సంప్రదాయాన్ని ఆధునిక జీవన విధానాన్ని ఈ కావ్యంలో మన ముందుంచారు ఆత్మీయులు ''కవిగారు''.

కవిగారు వివిధ భాషా సాహిత్యాలను అధ్యయనం చేసి భారతీయ భాషా భావాల అందలమెక్కారు. ఏ భాషలోనైనా కవిత్వం తనచెవులకు వినిపిస్తే అక్కడ నేను ఉన్నాను అంటారు. వివిధ భాషల భావాల సౌరభసమ్మేళనమే ఈ ''ఓంకార నాదాల'' ఆవిర్భావం.

ఈ కావ్యంలో కవిగారు ''జైఓం'' తో ప్రారంభించి తన్వైన తెలుగు గజల్స్ లాంటి నాదాలు ఎనభై పైగా చేర్చడమే కాక ఉర్దూ, హిందీ భాషల్లో ప్రముఖ కవులవి ఎనభై పైగా గజళ్ళు తెలుగులోకి అనువదించి పాఠకుల హృదయాలను అలరింప జేశారు.

సమాజంలో దినదినం తరిగిపోతున్న నిత్యవిధులైన భక్తి, ఆరాధన, నియమం, నీతి విలువలపైన గోపాలకిషన్ రావుగారు తమ కవితలను సులువుగా అర్థమగునట్లు వ్రాసి ఈ కావ్యంతో యువ - నవ తరానికి మార్గదర్శకులుగా నిలిచారనటంలో సందేహం లేదు.

''ధర్మ సంస్థాపనే తన అవతారావసరమన్నాడు
ధర్మాన్ని కాపాడడమేగాక భగవద్గీత నందించాడు''

శ్రీ గోపాలకిషన్‌రావుగారి హృదయం కుసుమ కోమలం. వారి హృదయంలో కవితా శైలి "పూవు పుట్టగానే పరిమళించునట్లు" బాల్యం నుంచే నింపుకున్నారు. అందుకే వీరి మేనమామగారు "కవిగారు" అని బిరుదును ప్రదానం చేశారు. ఆ పేరుతోనే "కవిగారు" నేడు లబ్ధప్రతిష్ఠులు.

శ్రీ గోపాలకిషన్‌రావుగారు వృత్తిరీత్యా ప్రముఖ విద్యుదింజనీరుగా పదవీ విరమణ చేశారు. నిత్యకవితారాధనతో తెలుగు సాహితిని అన్య భాషల ప్రభావంతో సుసంపన్నం చేస్తున్నారు. వీరి ప్రతిభకు మచ్చు తునకలుగా వీటిని పరిశీలించండి. అవి మీరు మెచ్చుతారని మళ్ళీ నేను చెప్పవలసిన అవసరం లేదు.

"సత్కారం బరువెంతో తెలుసుకోండి అందరును
పూలదండ పడకముందే వంచేస్తుందది తలను"

★★★

"మార్గం కఠినమౌతూ పోతుంటే నిజం
కఠిన సంకల్పులే సాగిస్తారిక పయనం"

★★★

"నిరాశావాది ఎల్లప్పుడు కారు మబ్బులే చూస్తాడు
ఆశావాది మాత్రం వెండి వెలుగులే దర్శిస్తాడు"

★★★

చెక్కిలిపై చుక్క కర్థం చక్కదనం తెలిసెనులే
ఘన నీ అందాలకు కావలివాడు వాడనిలే"

★★★

నిశ్శబ్దపు చూపుల భాష నీకసలు రానేరాదోయి
అశ్రువులు నా కళ్లయందదేగా మాట్లాడునోయి''

(డా. సాదిఖ్ నఖ్వీ ఉర్దూ కవితకనువాదం)

★★★

ఉదయకాంతులు చూడాలని ఉంటే చీకటిరాత్రులు తప్పవు
జీవన సంధ్యే లేకుండా ఏ జీవిత వెలుగులు భాసించవు''

(డా. ఇందు వశిష్ఠగారి హిందీ కవితకు అనువాదం)

★★★

హైదరాబాదుకు చార్మినారుతో ఎంత సంబంధముందో ఉర్దూ గజల్లతో అంత అనుబంధముంది ఈ కవిగారికి.

వీరు తమ నిశిత పరిశీలనా దృష్టి, పదును ఆలోచనలతో తెలుగు సాహిత్యంలో మరిన్ని ఉత్తమ కావ్యాలను అందివ్వాలని కవిగా నా ఆకాంక్ష. ఇంతటి మంచి కావ్యాన్ని ''జ్ఞానపీఠ బహుమతి గ్రహీత ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి సమర్పించటం అత్యంత సముచితంగా ఉంది. వారికి అంకితమౌతున్న కావ్యానికి 'హృదయనాదాలను'' అందించుట నా భాగ్యంగా భావిస్తున్నాను.

డా॥ కర్నాటి లింగయ్య
స్థాపకులు
నందనవనం (సాహితీ సమితి)
2-1-533, నల్లకుంట,
హైదరాబాదు - 44.

ఆరంభ శూరత్వం ఆంధ్రులకో వరం
ఆరంభం లేనిదే అంతమెలా సాధ్యం

చక్కని ఆరంభమే సగం కార్య సాధన
మనల మనం తెగడడమే మన దుర్భర వేదన

ఆంధ్రుడు విశ్వామిత్రుని అంశా - సంతతి అందురు
ఆంధ్రుడసలు లేనేలేని దేశమే లేదందురు

అలాంటప్పుడు గొప్పవాడు కాడెందుకు ఆంధ్రుడు
ఎలా మసలుతున్నాడు ఎలా ఎదుగుతున్నాడు

ఎంత కోపమెక్కువైతె అంతగ ప్రేమ ఉన్నట్లే
ప్రేమ వున్నవారిమీదే కోపం చూపుదురన్నట్లే

కోపంతో చెప్పువారు కోరుతారు అభివృద్ధిని
ముసి ముసి నగవులతో కొందరు ముంచుతారు కొంపలని

ఆంధ్రుడు తానెపుడూ అనంత విశ్వాత్మజుడు
కవిగారూ ఎంతగ ప్రపంచాన గౌరవింపబడుతున్నాడు !



నల్గురినీ నవ్వించడం
నా జీవిత పరమధ్యేయం

నల్గురికీ సాయపడడం
నా చేతల నర్మ భావం

నల్గురకూ హృది పంచడం
నా కవితల నడత విధానం

నల్గురునూ ఎదగ జూడడం
నా కన్నుల ఎద ఆరాటం

నల్గుర్కై కరిగిపోవడం
నాకు సదా మహదానందం

కవిగారు అనిపించుకోవడం
కమనీయమైన తురీయం !



సకల బలా సంరక్షించు
సర్వజనుల నారాధించు

ఒకరిని ఇంకొకరము
కాపాడగ మము కరుణించు

అన్ని గొప్ప ఆలోచనలే
బుద్ధి జ్ఞాన సామర్థ్యాలే

ఇమ్ముమాకు మేమింక
కరుణాళుల మౌదుములే

మా జ్ఞానము విజ్ఞానము
వెలుగులీన ప్రపంచాన

ఈర్ష్యా భయ విద్వేషము
చొరకుండా మాలోన

శాంతీ ప్రశాంతి కరుణ
కాంతీ క్రాంతీ దిశలు నిండ

కవిగారూ సకలబలుడు
కాదా మనకిక అండ !
(సహనావవతు మంత్రం స్ఫూర్తి)

సంస్కృతం తెలియక సంస్కృతీ శూన్యులై
వేదమే తెలియక విధిజ్ఞాన విహీనులై

ఆర్యులందరు తాము అనార్యులై దుష్టులై
గొప్ప ఈ దేశాన్ని కుప్పగూల్చిరి భ్రష్టులై

మానవులంతా ఒకటను మాట తెలుపుకద వేదము
భూమంతా ఒకే కుటుంబమని బుద్ధి నేర్పు విజ్ఞానము

ఎన్నిటికని బాధపడతాం ఎందరెందరిని తిట్టిపోస్తాం
సంస్కృతం దేశ భాషచేయని సంఘ ద్రోహుల నేమందాం

ఇప్పటికీ మించిపోయి సాధించలేంది లేదు
సంస్కృతం వినా చనిపోతున్న సంస్కృతికి మోక్షం లేదు

ఇదెన్నటికైనా సాధ్యమౌతుందా కవిగారూ అసలు
గీతోపనిషద్వేదాంజలుల మీకవిత్వీకరణలేనా మోక్షాలు



వేద విజ్ఞానంలో ఓలలాడే బదులు వాదాలలో మునకలేస్తున్నాం
ముందుకు దూసుకు పోయే బదులు తిరోగమిస్తున్నాం

ఇకనైనా మన తప్పులు దిద్దుకొని దేశం బాధ్యత మనదేనని
విలువలను పునరుద్ధరించి అనిపిద్దాం జాతికి వారసులమని

ఇక్ష్వాకుల కాలంనుండి తెలియనిదా ఈ దేశం ఖ్యాతి ప్రఖ్యాతి
ఎందుకిలా నిర్వీర్య మౌతున్నది జాతులలో సమున్నత జాతి

లెక్కకు నూరు కోట్ల జనం ఎవ్వరూ నా జాతి, నా దేశమనవినం
జపనీయుల సమయజ్ఞానం జాతీయతా భావమే ఆచరణీయం

ఏ దేశంలోని సగటు మానవునికి మనం భారతీయులం
ఏ విషయంలో ఏ విధంగా ఏ మాత్రమూ తీసిపోం

మరువరాని విలువలతోనూ మహితమైన శ్రమశక్తితోనూ
మన మాదర్శంగా ముందుకెళ్ళడమే కవిగారూ ఇక మన పని



సుఖం కన్న దుఃఖాన్నే సౌఖ్యంగా తలుస్తాను
మిత్రుని కన్న శత్రువునే మిక్కిలిగా ప్రేమిస్తాను

వెలుగుకన్న చీకటినే వేయి రేట్లు కోరుతాను
బ్రదుకు కన్న మరణాన్నే మహితంగా స్మరిస్తాను

గెలుపుకన్న ఓటమికే విలువ చాల ఇస్తాను
జీవం కన్న జడాన్నే జేజేగా భావిస్తాను

ధనికుల కన్న పేదలకే దగ్గరగా వసిస్తాను
ఆకలీ కోపాలలో అదే రీతిగా ఏడుస్తాను

మొదటివి కవిగారికి నేర్పింది మోహాలని అంటాను
రెండవ ఉద్విగ్నాల్నే మెండు గురువులంటాను !

(ఆచార్య సి. నారాయణ రెడ్డి గారి
సుఖమైనా, దుఃఖమైనా గజలు స్ఫూర్తి)



కళ్ళు మూసుకుని చూసేదాన్ని ఎల్లా అనగలం న్యాయమని
కుళ్ళు సాక్ష్యాలను నమ్మేదాన్ని ఎల్లా అనగలం ధర్మమని

అవసరమైతే న్యాయస్మృతి అంతా తిరగేసి వ్రాయాలి
అపవాదులపై శిక్షించేరీతి అదెంతగనో అన్యాయం మారాలి

న్యాయ దేవత కళ్ళు విప్పితేనే న్యాయం లభిస్తుంది కోర్టుల్లో
సాక్ష్యాధారాలు సత్యమైతేనే ధర్మం గెలుస్తుంది వ్యాజ్యాల్లో

గుడ్డి సాక్ష్యాలను నమ్మని గొప్ప ధర్మాధికారులు కావాలి
నత్త నడక న్యాయాలకు కొత్త పరుగులందించాలి

అపుడే న్యాయ స్థానాలు అవుతాయి ధర్మాసనాలు
అవి వినిపించే శిక్షలు అగును శిరోధార్యాలు

ఇవన్నీ కవిగారూ కాదా మీ రంగుల కలలు
ఎప్పుడైనా అయినాయా మీ కలలేవైనా నిజాలు !

★

అతి గొప్ప ఆరోగ్య రహస్యం చెప్పమంటారా
మితాహారమనంటే మీరు వెంటనే నమ్ముతారా

మహామంచి సగాలే పతులకు చీడలౌతున్నారు
గయ్యాళి గంపల వారి గతింకేమిటంటారు

లేమల దుర్నడతలపై ఎందుకు కవిగారు సిరా
లింతగ వృధా చేస్తారు బాధపడడమే మానరా !

విశ్వాత్మజుడు కవిగారూ సినారె విర్వైన ఖ్యాతి భళారె
అనంతమైన ఎత్తులలో అంబరంరీతి అలరారె !



ప్రశంసల జల్లేకాక కుంభవృష్ఠి కురిపించు
అదే నిందలను మాత్రం వేసేముందే ఆలోచించు

హృదిలో నీ ప్రణయాన్ని హృద్యంగా దాచుకుంటా
కవితలల్లిగానం చేస్తా కాదు నీవు కావాలంటే

అతడు చెడు అని నేనూ చెడైతే తనకూ నాకు తేడా యేది
మంచితో చెడును రూపు మాపితే కదా మాతా దుర్గ అయేది



ఆదర్శ గృహస్థుడే అవశ్యం నేతృత్వాని కర్షుడు
ఆతని స్మరణనే అందుకుంటాడు సకలబలుడు

కాయకష్టం చేసేవాడూ కష్టపడి చదువుకునేవాడు
ఇద్దరిలో రెండవవాడే ఎక్కువగా పరిశ్రముడు

ప్రతి ఒక్కడు స్వర్గానికి మాత్రం వెళ్ళాలనుకుంటాడు
కాని అదేమో తాను కలకాలం బ్రతకాలంటాడు

కొన్ని నాళ్ళ క్రింద ఇల్లే నన్ను వెదుకుచుండె
కాని ఇప్పుడెటువెళ్ళినా ఇల్లే చేరాల్ననిపిస్తుండె

వంగ గలుగు కదా జీవమున్నవాడే
వంగని ఆనాడు శవమే కదా వాడు

గుండెలోన భగవంతుడు దండి నిదురపోతున్నాడు
కోరికలూ గుండెచుట్టు మూగి గోల చేయకుడు

ధనమూల మిదం జగత్తు ఘనమైన పాత నానుడి
ఇంధన మూల మిదం జగత్తు కవిగారిగా నా నుడి !



ఎవరి బ్రతుకువారిని బ్రతకొద్దని నేననను
ఇతరులనూ బ్రతకనిచ్చే ఇంగితముండాలందును

వ్యసనమనే రోగానికి ఏడ్స్ ఒకటి తోడాయెను
రెండూ రెండే ఇందు దేనికీ చికిత్సయే లేదాయెను

పదిలంగా ఈ రోజును మనం వాడుకొన్నామా
రేపును ఈ రోజు తనే పదిలంగా కాపాడును

కాలాన్ని సుమా నేను కలలోనూ తిరిగిరాను
ముందుకెళ్ళు తుండడమే పసందుగా భావిస్తాను

సత్కారం బరువెంతో తెలుసుకొండి అందరును
పూలదండ పడకముందె వంచేస్తుందది తలను

జీవన యానం మొత్తంగా గెలుపుతానవాలి కాని
గెలుపే గమ్యమనుకునే గోరోజనం దేనికని

అన్ని ముఖాలపై చిర్నవ్వే అగుపడే కవిగారు చచ్చెనేని
అదేమో కవితామణి రోదిస్తుండె కదా ఓ మూల కూర్చొని!



శ్రీయాలందరి కొసంగు శ్రీలక్ష్మీ దేవి కొంగు
తన కొంగుకు ముడేసుకున్న శ్రియఃపతిదే హంగు

నీరు శరీరాన్ని పరిశుభ్రం చేసిన రీతిగ
నిజాయితీ మనస్సును పవిత్రం చేస్తుందదే తీరుగ

ప్రతి చెడ్డ పుస్తకం కవిగారూ ప్రబలంగా అదో దొంగ
అది దోచు చదివేవాని సమయం డబ్బు బుద్ధి యేకంగా



ప్రజల సొమ్ము గంగాజలంలా పవిత్రం అది తెలుసా
అందుకే అందరికది తీర్థ ప్రసాదమంత అలుసా

సాఫుగ ప్రతిరోజూ వచ్చినదా ఉదయం దస్తు
చక్కనినీ ఆరోగ్యానికది కుందనమంటి గుర్తు

రాస్తులేను సేనంటూ కవిగారూ రాస్తున్నారింతలేసి
ఏమంటే దాటేస్తారు సకలబలుని పని ఇదనేసి !



సుగంధాలు చిమ్మకుండ పూవునాపగలడెవ్వడు
పరదాయే లేకుంటే నీ అందాలు అంతే చూడు

పనులన్నీ ఆత్మతో చేయడం పద్ధతి నాది సుమండి
అపుడందులో తప్పులు అతి తక్కువ చూడండి

తనకు మించి ఎవరెదిగినా మనిషి సహించలేడు.
అష్టైశ్వర్యాలలో తనే తులతూగాలను కుంటాడు

అతిథిని నేనే నాయింట్లో అనిపిస్తుందపుడపుడు
అంతా ఎదిరి చూస్తారు పోదునో నేనని ఎపుడెపుడు

ఆత్మ సాక్షి అనే కుక్క అది మొరుగుట మొదలిడు
ఖర్మకాలి పాపమొకటి మీరు చేసినప్పుడు

ఇంటికతిథిని పిలిచి ఏడిపించాలనుందాండి
ఇచ్చిన మీ చిరునామా ఇంటినే మార్చేయండి

కష్టాల్పేర్చిన కాష్టాలను కవిగారూ కన్నీరార్పకల్గెడు
కన్నీరే పేర్చితే కాష్టాలను చెప్పండార్పశక్తుడెవ్వడు



కొరగాని కోర్కెల మంటలలో బిరబిరా కాలిపోతు
దీపం వత్తిలా రాతిరంతా దిగాలుగా రాలిపోతు

జీవితమంతా తలపెట్టగా ద్రోహమదే చూతు
ద్రోహానికి నేను మాత్రం దూరంగానే నిలుతు

కనుల మదిరను నేను త్రాగి త్రాగి తూలుతూను
కైపెక్కి పడిపోయాను కాళ్ళవి తడబడితేను

కాస్తసందు లేకుండా గాయాలవి ఒళ్ళంత
కాంతులనీనుతున్నందుకా ఘనంగా త్రుళ్ళింత

అదేమో ఉపనిషత్తులూ వేద భాగాలను ఆ రీతి
కవిత్వాంతరీకరణలు కమనీయంగానే చేసితి

పరమపిత చేతులలో పరికరాలమే మనమంత
అతని చెప్పు చేతలలో నడవాల్సినోళ్ళమే సుంత

గోతుల తీతలతో కొంపంతా కొల్లేరయితే
సకలబలుడూ సరస్వతమ్మ కవిగారిని కాచారంతే !



యవ్వనం ప్రతి ఒకరికి నిండార్లపు వయసు నిజం
చూపులేవియైన కూడ చెడ్డ పేరు కదా తథ్యం

సునాయాస జీవితం కఠిన శ్రమాఫలితం
అనాయాస మరణమే అందరికీ అవసరం

ఛాతీలో గుండె వున్న ఛాయలవే కన్పించవేం
ఎన్నోనాళ్ళనుండా మూలున్నది ఖాళీగా అదేం

కొంతేమో కౌమారం కొంత పిల్లకాయతనం
ఇద్దరు పిల్ల రాక్షసులు ఉద్ధతియే యవ్వనం

పూలు త్రుంచడం తప్పదు తప్పదు చెట్లు నరకడం
మనసు మాత్రం త్రుంచ వద్దది సకల బలుని ఆలయం

ఎవరైతే నాకేమిటి పొందువారు అనురాగం
నా బ్రదుకున ఎల్లప్పుడు ఆకురాలు కాలం

ఎన్ని విరహ గీతాలు కవిగా రెంతెంతగా పాడితేనేం
విన్న పాపాన పోనప్పుడు వింత చెవిటి భాగోతం !



కష్టాల కడలిలో కలిసి రాదదాయెనే కనీసం
ఇంత నిర్దయౌతుందని కలయందనుకోంది నిజం

జీవితంలో జరుగలేదు అనుకున్నదే మాత్రం
సుంత ప్రేముడితో కలిసున్నదెన్నడు కనకం

ఇతరులకై బ్రతికిన వారి పేరే సతతం
ఎల్లెడలా విన్పించు భళారే ఓ నేస్తం

కృతజ్ఞత ఎరుగుదురా అతి చిన్న మంచితనం
కృతఘ్నత చెప్పలేనంత బహుదొడ్డ చెడ్డ గుణం

మార్గం కఠిన మౌతూ పోతుంటే నిజం
కఠిన సంకల్పులే సాగిస్తారిక పయనం

నీవు మనశ్శాంతుడవవాలంటే అనవరతం
అవగుణాలతో పోరు చేయ్యాల్సిందే నిత్యం

చుట్టూ మిమ్మేమవగించే చూపులనే చూస్తుండడం
కవిగారూ అవన్నచో ఇంకెందుకు కనికరం !



చెప్పులు లేవను నా బాధ తీరనేలే చివరకు
కాళ్ళు లేని వాడు నాకు కనిపించేంతవరకు

తారా చంద్రుల తలవకు కోరికల నిరాశ పర్చకు
చావును వద్దనుకు జీవితాన్ని నిస్పృహ పాల్చేయకు

సంగీతానికీ సాహిత్యానికీ నృత్యానికీ దాతృత్వానికి
ఏ ఎల్లలు అడ్డురావు ఏ ఆంక్షలు నిల్వావు చివరికి

నాకంటి పాపలలో వెదుకుము నీ అందాల కొలుకు
నీ హోయలు నీ సొగసు కప్పించుములే నీకు

ధర్మ మార్గములందు నడుచు వారెల్లరకు
శాంతి సుఖములు దొరకును చాల వరకు

చెడు జనాల చెలిమికి అర్రులు చాచకు
చింతల చితిలో కాల్తూ ఏకాకిగనైనా బ్రతుకు

ఎంత ఆలోచించినా సుంత తట్టలే మెదడుకు
తప్పు కవిగారిది లేకుండా శిక్ష ఇతరుల తప్పుకు !



చిన్నప్పటి కోరికొకటి చిత్రంగా అది తీరనేలేదు
ఎన్ని సార్లు వానలో తడవాలన్నాకుదరనే లేదు

తల్లి కొంత కాలమే కదా తండ్రికి నిజంగా ముద్దు
ఆపై పిల్లలే అయ్యగారికి ఆనందాల హద్దు

మనస్సాక్షి కెప్పుడు బదులన్నది లేనే లేదు
అది వుంటే ఉన్నట్లే లేకుంటే సుఖం లేదు

జనాభా పెరుగుతూ పోతున్నకొద్ది
మానవత్వం కరువై పోతున్నదదేంది

నీపై మోజు నాకు నిండి పోయినప్పటి నంది
నరకం స్వర్గాల మీద నమ్మకమే పోయింది

తనకేమి జరిగినా అది దయ సకలబలునిది
అనుకున్న వానికన్నా ఆనందమైన బ్రదుకింకెవరిది

చివరిదాకా కవిగారూ కలిసుండే మనసు చెలికేది
ఎవరిదారి వారేయ్యై మీకిలాంటి బ్రదుకేంది !



తను లేకుంటే పనులన్నీ ఆగుతాయనుకుంటాడు
అది తన అపోహనని అసలెందుకు తెలియడు

ధర్మ సంస్థాపనే తన అవతారావసరమన్నాడు
ధర్మాన్ని కాపాడడమే గాక భగవద్గీతనందించాడు

సకలబలుడు కనిపించని అమ్మలాంటివాడు
అన్నిచోట్ల ఉండలేకనే అమ్మను సృష్టించాడు

జీవ నిర్జీవ తతులలో జ్యోతి తానేనట సకలబలుడు
అన్ని ఏర్పడే పదార్థాల మూలం తానేనంటాడు

ఏ మనిషీ ఎప్పుడూ జీవితంలో ఏకాంతుడు కాడు
ఏదో ఓ సమస్యెప్పుడూ నీడై ఉంటూ ఏడ్పించెడు

మానవతా మూర్తిత్వమదేమో చూడాలనుందాండి
మదీయ జీవితమే అద్దం మరందులో తొంగి చూడండి

మహికెలాగో సకలబలుడు సృష్టి స్థితి లయకుడు
మాయకూ కవిగారూ తనే పరమ ప్రపితామహుడు !



లక్షలు కోట్లు సంపాదించడమే కాకూడదు లక్ష్యం
విలువల పరిధిలో బ్రతికిందే వేల్పులట్టి జీవితం

స్వర్గవాసం చేయాలని చాలామంది కుబలాటం
స్వచ్ఛమైనది మనసైతే స్వర్గమిదేననెరుగరు జనం

అవార్డులు పొందడంలో లేని అమందానందం
అవి పొందే అర్హత సంపాదించిననే కల్గు నిజం

నవ్వనే కసరత్తును విధిగా చేయాల్సిందే దిన దినం
అది నీ రక్త ప్రసరణను అంతగ చేయు క్రమబద్ధం

జీతం కన్న ఖర్చు తక్కువైతే జయకేతనం
ఖర్చుకన్నా రాబడి తక్కువైతే అదే ప్రభుత్వం

బాధల నరువు తెచ్చుకునే వారు చెల్లించే మూల్యం
కవిగారూ ఉండదు ఉన్నంతలో జీవిస్తే మనస్తాపం



శివుడూ శ్రీకృష్ణుడు చిత్రంగా అద్వైతులు
పూర్ణ మనో భక్తులతో పూజించాల్సిన శక్తులు

పుట్టగానే లీలలతో త్రెంచసాగెను శృంఖలలు
నదే రెండుగా చీలిదారిచ్చే నందునింటికెళ్ళే దారిలో

తప్పులే చేయనివారు తమౌతారు మహనీయులు
తప్పుకు పశ్చాత్తాపించనివారే సగటు మనుషులు

పది మందితో కలసి మెలసి మానవుడు జీవించాలి
చిన్ని నా పొట్టకు శ్రీరామ రక్ష భావాన్ని విడవాలి

గృహస్థు పోషించాలి బ్రహ్మచారీ వానప్రస్థుల సన్యాసుల
గురు బోధలతో తానూ మోక్షార్హుడన్నది తెలియాల

ఆశావాది కగుపడేది అన్ని తలపుల గొళ్ళాలే
అదే నిరాశావాది చూచేది తలుపుల కున్న తాళాలే

తోటి వారితో ఆనందాలు తొణికించిన కొన్ని క్షణాలే
మనిషి జీవితంలో కవిగారూ మహితమైన క్షణాలు !



సమాజానికి పనికొచ్చే ఓ పని పూర్తి చేయంది
ప్రతి ఒకడూ చావను నేనని ప్రతిన పూనవలసున్నది

ఓపిక బ్రదుకుకు ఓ షాక్ అబ్జార్వర్ లాంటిది
ఒద్దికగా జీవిత ఒడుదొడుకులనోర్వచేస్తుందది

యువకుల హృదయాలను పూలకుండీలు చేయవద్దు
అవి జీవితాంతం వెలిగే దివ్వెలైతేనే ముద్దు

సాటివానికి మనం సహాయమెంత చేశామన్నది
మనిషిగా మన జీవితాలకు మహా గొప్ప గురుతది

పదో పాతికో అడుగులే మనతో ఎవరైనా వచ్చేది
జీవితాంతమూ మనతో మనమే కదా నడిచేది

బెల్టు క్రింద పేదరికం పెరుగుతునే ఉంది కదా
అందరి నక్షరాస్యుల చేసే కుందనాశయం లేకే కదా

మీ అజ్ఞానాన్ని మీరెరుగుతున్నంతసేపు సదా
కవిగారూ జ్ఞానతృష్ణ మీలో పెరుగుతునే వుండు కదా !



మనమొక మహా సంధి మాయలోన ఉన్నాము
చీకటి కాకూడదు చిక్కు వెలుగుకై విజృంభిద్దాము

నీటి బిందువులనిధి నీలి జలాల సంద్రము
వాటి సంఘటిత శక్తి వల్ల కదా అది సాధ్యము

ఎంత ఆపి పెడతామో కవిగారూ అంతగనే దరిద్రులము
ఎంత పంచి పెడతామో అంతకంత ధనవంతులము !



ఎన్నెన్ని ప్రమాణాలు ఎంతగనో చేసుకున్నవారు
ఎటుల వీడి పోగలరో యేమో అనూహ్య మా తీరు

ధర్మము రూపు దాల్చి దశరథ పుత్రుడయాడంటారు
అందము ఆయనకై ఆసీతమ్మై వచ్చిందంటారు

దుఃఖం మనస్సు నెంతగనో దోచేసినచో కవిగారూ
సుఖం గతి యేమగునో సూచాయగనైన చెప్పరూ !



విద్యా బుద్ధులు రెండు వేర్వేరు మహా నిధులు
జీవనాన్ని జీవితాన్ని వరుసగా సార్థకం చేసే విధులు

లేమి విసుగు దుర్గుణాలు మన పాలిటి శాపాలు
కఠిన శ్రమ మానవతా విలువలే కాపాడెడి పాపాలు

కోపాలు తాపాలు కయ్యాలు కోట్ల ఇళ్ళలో మామూలు
ఇంతగనో మూర్ఖ సుదతి ఈ జగాననే లేదసలు

అష్టమహిషులే కాక అగోపదారువేల గోపికలు
అందరినీ అలరించెను నల్లనయ్య రసికతలు

తప్పులు కావాలని చేసే వారే రాక్షసులు
తప్పులు చేసి ఒప్పుకోని వారే పశువులు

తమనందరూ అర్థం చేసుకోవాలనే కొందరు ఘనులు
ప్రక్కవాడి నర్థం చేసుకునే మనసులేని పాపులు

కలలూ దర్పణాలు కాకేం అవి కవలలు
అందు చూసిన వన్ని కవిగారూ పనికిరాని వస్తువులు!



భగవత్సంకల్ప మన్నది భళారే తిరుగులేనిది
కావాలంటే కల్గనిది వద్దనుకుంటే కాదు మానేది

ఎన్ని భాషలో ప్రపంచాన అందరికన్నీ అర్థం కావుకదా
అనురాగం అనే భాష అందరికంతటా అర్థమయ్యేది

ఆనందాన్ని అందరితో పంచుకో అది పదిరెట్లవుతుంది
అదే దుఃఖాన్ని పంచుతూ బోతే అదే అర్థమౌతూ పోతుంది

అసలేమీ తెలియని వాడెలా అరుదే అరుదో
అన్నీ తెలిసిన వాడూ ఈ ప్రంపచాన అరుదే

కష్టాల ఒడిలోనే జీవిత కథలు కంచికెళ్ళ కలిగేది
అలలేలేని స్తబ్ద కడలిలో అసలేం థ్రిల్లుంటుంది

ఇతరులను జయించడం యేమంత గొప్పకాదు
తనను తాను జయించడం కన్న గొప్ప ఏదీ లేదు

చీకటి బ్రతుకులలో సదా చిందేస్తుండ గలదా
చీకటి తదుపరి కవిగారూ వంతు వెల్గదే కదా !



అధికార భాషా సంఘం అధ్యక్షులెందరో వచ్చి పోయిరి
ఆంధ్ర భాషను మంత్రాలయంలో అమర్చనే లేరైరి

మక్కువ మన భాషపై చూపే దిక్కూ దివాణమేది
మనల నుద్ధరించగల బ్రౌను దొరల బలగమేది

భాషా సంఘం అధికారం పది నిమిషాలే చాలు కవిగారికి
రాష్ట్ర భాషలు సంస్కృతమూ తెలుగులు చేయ వీలు !



అనంత శక్తి సమన్వితుడా సకలబలుడు
అహరహ మాతని ఆలోచన ఆత్మసత్తా పెంచుచూడు

ఇంతగ సంతోషుడు ఈ జగానలేనె లేడు
సుంత తలనొప్పి లేని సంతసాల పురుషుడు

సద్గుణమూ సద్బుద్ధీ చలించని ధైర్యమీ మూడు
కవిగారంతటి కమనీయుని త్రివేణి సంగమాలు చూడు!



నాకు నచ్చని ఒక వాక్యాన్నీ నేను ససేమిరా వ్రాయను
కొందరు వీటన్నీ మెచ్చుకుంటే అహో నేనేం చేయను

అనురాగం ఆత్మీయత అందరికీ పంచినాను
అవతలి వారెందరి నుండో అవే నేను పొందినాను

భగవద్గీతను నేను బాగా వంట పట్టించు కున్నాను
అదిగో అందుకేనేమో కవీత్వాంతరీకరణ చేయగల్గాను

పురాణాలు శాస్త్రాల్లాంటి వింకెన్నెన్నో వంతుకుగాను
డాగిలిపై సుత్తి దెబ్బలకై ఆగి యున్నవి కవిత్వీకరణకేను

పక్షులు దినమంతా తిరిగి ప్రాయంత్రం గూడు చేరును
ప్రాణమూ జీవిత సంధ్యలో వదిలి పరమాత్మ చేరును

జీవితాన్నో పువ్వులాగా మార్దవంగా పెంచితేనే
అందులోనుండి వెలికి వచ్చునంతగా ప్రేమ అనే తేనె

మంచి ఎక్కడున్నా కవిగారు వంచి తల ఆదరిస్తారు
చెడు ఏ మూలున్నా అదేమో చీకాకై అరుస్తారు !



నీకు ఆనందం మరి నాకో ఆత్మీయత కావాలి
ఎవరి గుండె బలం ఎంతో యిక తేలాలి

నీవు నాదరి కొచ్చేస్తే నవ్వులే నవ్వుల పువ్వులు
చందమామా జతైతే చల్లని వెన్నెల ఆలింగనలు

చందనం వృక్షం చుట్టూ సంచరిస్తున్నా సరీసృపాలు
అందుకనేమన్నా విషభరితాలా చందన సుగంధాలు

పవర్ రేట్ల మిషతో మొదలైన నిరశన వ్రతాలు
పవర్ తగ్గిపోయి మరింకో మిషతో ఆపడాలు

ప్రయాణాన రోడ్డు మలుపులల్లే జీవితాన చీకు చింతలు
ఆనందంగా అంతమైతే రెండూ రెండాహ్లాదాలు

జీవితమను నాణానికి ఇరు పక్కలు ఆశనిరాశలు
ఆశకన్నా నిరాశవేపే అది ఎక్కువ ఒరగడాలు

చూడగానే ఎవరందం చెప్పాలనిపిస్తుందో గజలు
ఆమె రాను ఎన్నడో కవిగారు చెప్పనెప్పుడా గజలు !



అనుభవం బుద్ధి బలం అవసరమే రెండూను
ఒకటి కింకొకటి తోడైతే ఓహో గెలుపే గెలుపేను

జీవితంలో ఎదురయ్యే చిక్కు ప్రశ్నలన్నిటికీను
నోరు మెదప కుండడమే నూరు విధాల విజ్ఞతౌను

అనుకున్నవనుకున్నట్లు అవడమసాధ్యమైతేను
అనుకోకుండా ఐనవే కవిగారూ ఆనందిస్తే పోయేను !



పట్టుదల బలీయమైతే కాదేదీ అసాధ్యం
ప్రబల నిదర్శనమే మన సాలార్జంగ్ మ్యూజియం

విధి నిర్వహణ కాంక్ష విపరీతమైనదా నిజం
ఎంతటి అలసటనైనా ఇంధనం చేసుకోవడం

కవిగారూ రచ్చ గెలిచి ఇంట ఓడడం
కాదా చరిత్రలోనే సరిక్రొత్త చేదు నిజం!



ఇంద్రియాలూ మనస్సూ బుద్ధి ఇవన్నీ మహిమాన్వితాలు
ఇంకా వీటన్నిటినీ మించినది ఆత్మని తెలిస్తే చాలు

నీవితరుల కిచ్చేట్టి నీ సలహాలు
నీవు మొదలు పాటిస్తేనే అవి ఘనాలు

తెగతిని బలిసే వారే తేరగా చచ్చే రోగగ్రస్థులు
మితిగాతిను వారలే మిక్కిలిగా ఆరోగ్యులు

వేద వృక్ష శాఖాంతాల వేదాంతాలగూడు మేడల
ఆశ్రయించిన ఆత్మసంస్కారులదే అనంతశాంతి సౌఖ్యాల

నేడు నీ తప్పు తెలిసికొని సారీ అన్నావనంటే
నిన్నటి కన్నా నీవు నేడు నిజంగా వివేకివైనట్లే

సకలబలుని చేతిగడియారమే సూర్య దేవుని లీల
క్షణమాగని చైతన్య శక్తిలా నడుస్తున్నాడీఇల

ఇద్దరే ఇద్దరులే కవిగారూ ఎపుడూ మంచోళ్ళు
ఈజగాన ఇంకా పుట్టనోళ్ళు మరేమో చచ్చినోళ్ళు !



పుస్తకాల జ్ఞానాన్నీ మస్తిష్కాల మమకారాల్నీ సమ
ఆపోసన పట్టినవాడే అన్ని రీతులా వివేకి సుమా

డబ్బు కొనలేని వెన్నెన్నో దండిగ వాటిని తలుచుకో
అపుడు నీవు కోటీశ్వరుడైనా అర్థం లేదని తెలుసుకో

నిర్ద్వంద్వంగా నీవు సకలబలునికి లొంగిపోతివనుకో
నీ జీవిత మెంత కాంతి మయమగునో చూచుకో

ఎదుటివాణ్ణి తప్పని ఎపుడూ నీవు చెప్పకు
వాడు నీది తప్పంటే ఒప్పుకోక మానకు

కుడి చేయి చేసే పని ఎడమ చెయ్యి కెరుక పఱచకు
కొద్దో గొప్పో చేసే దానం నీ కోమలికైనా తెలియనీకు

పాత భావాలనే సదా పట్టుకుని వ్రేలాడకు
పరుగెత్తే ప్రపంచంతో పరుగిడటం మఱువకు

కృష్ణావతారంలో కవిగారూ క్రియాకలాపాలకు
ఎన్నెన్ని ప్రయోజనాలో వెన్నుని లీలలకు !



ఆలోచించే బుర్రలూ అహరహం కష్టించే చేతులు
అందరినీ ప్రేమించే హృదయాలే అనంత వందనీయాలు

గుడులూ బడులూ గ్రంథాలయాలు
అర్థంతో పోల్చదగిన అంతటి ఆలయాలు

ఎందరెందరో పుడుతుంటారు మరెందరో గిడుతుంటారు
జీవితం ధన్యం చేసుకోవాలనే కవిగారి జిద్దునేమనంటారు!



వచ్చాం మనమెక్కడి నుండి పోతామెక్కడికండి
తెలియని మహా రహస్యం తెలిసేదెట్లానండి

కనులున్నా వెలుగు లేక కనబడదేదీ మనకిట
శాస్త్రమనే ప్రమాణం లేక జ్ఞానమూ వర్ధిలలేదట

ఇంకా ఇంకా వాణీ పలికించు ఇంపగు కైతలు చెప్పించు
కవిగారూ అంతా వాహ్వాయను ఘన వ్రాతలు వ్రాయించు!



తను నిర్వహించ వలసిన తగిన కార్యం దొరికినోడు
ధన్యుడు వాడవటాన్ని తప్పించగలుగునెవ్వడు

ఇతరుల అడుగు జాడలలో సదా నడిచేవాడు
ఎలా తన అడుగు జాడలు వదిలెళ్ళ గలడు

మంచితనం నమ్మకం ఈర్ష్యాలేశాల నిచ్చెనలతో చూడు
మనిషి మాననీయుడై ఆకసాల పై కెదుగుతాడు

పళ్ళ చెట్లకే కదా పది మందీ రాళ్లిసురుతారు
పళ్ళకై చెట్లు పెంచిన ఇళ్ళనెలా కాపాడుతారు

వార్తా పత్రికల పరుపులో వాడు నిద్రిస్తాడు
తెల్లారక ముందే ఫుట్పాతును చల్లగవదిలేస్తాడు

వాడి గూర్చి మాట్లాడితివా వాడు నిన్ను వదలడు
నీ గుఱించి మొదలిడితివా వాడు లేచి వెళ్తాడు

దేవకీ వసు దేవుడు యశోదా నందుడు
నల్గురి తపః ఫలమే కవిగారు నల్లనయ్య శ్రీకృష్ణుడు !



సొమ్ములన్నీ తూకమేసినా సుదతి సత్యకు తూగనోడు
తులసి దళానికే తూగి పొలతి రుక్మిణిదే ప్రేమన్నాడు

తెలియాల్సిందీ తెలియనవసరంలేంది కడు
నిశితంగా తెల్సినవాడే అన్నీ తెల్సినవాడు

జనులందరినీ ఒకే రీతిగా ఆదరించు విజ్ఞుడు
జగానికే ఆదర్శుడనదగిన విశ్వమానవుడు

విధులు విద్యుక్తంగా నెరవేర్చిన వాడు
హక్కులకై నిలదీసే హక్కున్న మానవుడు

తోటి మనిషిని ప్రేమించే వాడే దొడ్డ దేశ భక్తుడు
అందుకనేమో గురజాడ దేశమంటే మనుజులన్నాడు

గులాబీలతో ముళ్ళిందుకని గోలపెట్టేవాడొక్కడు
ముళ్ళ మధ్య గులాబీ లెట్టాడని మురిసే వాడొక్కడు

ఆనాడు పరమ శివుడు హాలాహలాన్నే మ్రింగాడు
ఈనాడూ కవిగారు చేదు జీవితం భరిస్తున్నాడు



ఇతరులను మోసగిస్తే ఏమైనా సరే అది అవినీతి
నిన్నే నీవు మోసగించుకొనుట శిక్షే లేని నేర ప్రవృత్తి

తప్పు నొప్పుకొనుట తథ్యంగా మహనీయత
దాన్ని దిద్దుకొనుట చెప్పలేనంత ఘనత

ఇంట్లో మగవాడేనా ఎప్పుడూ నియంత
ఆడది తగదా ఆపనికి ఇసుమంత



దుఃఖం నాది చూపొద్దని దొరలేకన్నీరాపితిని
చిరునవ్వున కనిపించే చింతనాపలేనైతిని

అంత నిర్విరామంగా అంతరాళ భ్రమణలోన
ఆదిత్యుడు మునిగున్నా అలిసేనా ఏనాడైన

బ్రతుకే కదా కవిగారూ బహు దివ్య పాఠశాల ఏమైనా
పనికొచ్చిందా మీరు బడులలో అన్నేళ్ళు నేర్చిందేదైనా



కోపం ముంచుకొచ్చినప్పుడు వందదాకా లెక్కపెట్టు
పాపం అదింకా తగ్గకుంటే ఆ ప్రదేశమే విడిచిపెట్టు

పాముకాటువేసిన మనిషి మంత్రంతో బ్రతికాడట
మనిషి కాటువేసినపుడు మంత్రమోడిపోయిందట

గతించిన కాలం గంటలను కొట్టు
గడియారము నెవడు తాను కనిపెట్టు

పాత అప్పు తీరక ముందే కొత్తది మరి చేసేదెట్టా
కణ కణ లాడే ఎండను కప్పు కిందికి లాగేదెట్టా

నీవు సృష్టించలేదేదీ అంతా పొందిందే ఇచ్చుట
నిన్న నేడు రేపెదెవరిదో మార్పు మామూలిచ్చుట

ఎంత పనిచేస్తుంటే సామర్థ్యమంత పెరుగు నంట
సామర్థ్యం నీటి చలమలా తీస్తుంటే వచ్చే తరగని ఊట

వయసంతా ఏడుస్తారని వ్రాసుందట నొసట
కవిగారికే సాధ్యమయెను బ్రహ్మరాత తప్పించుట !



కష్టాలు కన్నీరు లేనోడుంటా రంటారా
కాస్త వాణ్ణి చూడాలనుంది నాతో కలిపిస్తారా

పోనీలేవే బాధపడకు అర్థమే కదా పలగ్గొట్టింది పారు
ఎందరు నిత్యం ఇతరుల గుండెలు బద్దలు చేస్తూ లేరు

ఆలోచనల రాబడికన్నా పదాల ఖర్చెక్కువైతే చూశారూ
అది దుబారాయే కాకపదాల కొరత శోకంగా మారు

జబ్బులోనూ ఆనందం అనుభవింప చేయును మరి
భువి యందలి అప్సరస నర్సనే ఆ సోదరి

కొందరు ప్రేమిస్తారొకరిని కొందరిద్దరిని ప్రేమిస్తారు
కాని వాణీ నేను మాత్రం నిన్నే ఆరాధిస్తాను మరి

గమ్యమడిగిన తరి గమ్మత్తదేమో పానశాలను చూపిరి
అచటికరిగితే ఆనాడు మధువు నిండుకున్నదనిరి

నీ పొందున సుఖ శాంతులు కోకొల్లలని వస్తే కవిగారు
ఆయన ఖర్మమదేమోగాని అయొనక్కడా చుక్కెదురు!



అందరి నొకే లాగ చూస్తాడు కదా సకలబలుడు
ఎందుకు ఆయన్నాదర్శంగా తీసుకోడు మానవుడు

ప్రపంచానికే మిత్రుడు ప్రబల శక్తి సంపన్నుడు
మన కెందరు మరి మిత్రులు మనగతేంటి చెప్పుడు

అన్నిటికో దినాన్ని అమర్చుకున్నారు సంవత్సరం నిండ
ఉన్నదా 'విశ్వమైత్రీదినం' ఓహో కవిగారూ చెప్పండి!



తెలుగునే కంప్యూటర్లలో వాడి వెలుగులీన చూడాలి
ఇంగ్లీషు వినా బ్రతకలేమనే ఇంగిత హైన్యం మానాలి

జపాను రష్యాలను మనం జర ఆదర్శం చేసుకోవాలి
మాతృ భాషనే ఎల్లెడలా మనమూ వాడుకోవాలి

మన సమస్యల పరిష్కారాలు మన కవిగారి నుండే వినాలి
ఆయనలా భారతీయ హృదయమందరికీ ఉండాలి!



అందరూ తమ తమ గూళ్ళు సుందరం చేసుకొన్నారు
అదేమో నన్ను గాలిలో కలల సౌధమందున్నానంటారు

ఆకాశం పైకి వెళ్ళి వీక్షించండొక సారి
అందమైన మన ధరిత్రి కన్పడు నాకాశం తీరె

గొప్ప అహంకారి కుసమాయోజన కుసంస్కారి
కుమనస్క ఈర్ష్యాళువు కోరి కోరి కూడినవారి

లౌక్యమింతగా జీర్ణించుకున్న చాకచక్యులే మీరు
ఇంత త్వరగా వీర వెర్రి వేదాంతులేలా ఐనారు

చిరునవ్వది యే జాతని చెప్పగలరా మీరు
అందరి దరహాసం కాదా అదొకే తీరు

శుచి శుభ్రత అంటూముట్టని మడి కట్టుకునేవారు
ఆమడి పంచెలోని అశుభ్రతనేవారు తెలుసుకోలేరు

తుఫానులో తూలి తూలి పోతున్నా కవిగారు
హృదయాన్నే దివ్వె చేసి యెదిగి వెలిగిపోతున్నారు !



మానవ జన్మ ఉత్తమం ఉదాత్తం ఎప్పుడన్నది తెలియుడు
మానవాళి సేవలలో పండినపుడే సాధ్యమది వినుడు

తప్పుడు సలహాలనిచ్చే ప్రతి ఒక్కడు
ఎప్పుడూ ఊరికి దూరముంచాల్సినోడు

ఇతరులకు సహాయం చేసే దయామయుడు
యేమైనా వారిని విమర్శించ హక్కున్నవాడు

కన్నీరందరి కళ్ళలోను ఒకటే చూడు
అవెక్కడ చూసినా నీవేనని తుడు

నిరాశావాది ఎల్లప్పుడు కారు మేఘాలే చూస్తాడు
ఆశావాది మాత్రం వెండివెల్గులే దర్శిస్తాడు

నాకన్నీ తెలుసనేవాడు నిజంగా ఏమీ తెలియనివాడు
నాకేదీ తెలియదనేవాడు నిజమన్నీ తెలిసినవాడు

అందాలను సృష్టించి గొప్పనుకునే నా సకలబలుడు
నాదాల సృష్టితో కవిగారు ఆయన్ను దాటేశాడు!



ప్రతిజంట ఆంధ్రులకు ప్రబలంగా ఒక దేవుడు
గతి ఈ రీతిగ వేరెవరికి పెద్ద దిక్కు చెప్పుడు

కోట్లాది దేవతలున్నా కనిపించేవాడొకే ఒక్కడు
కొలతకందని కాంతి శక్తి నిచ్చె గొప్ప గ్రహం సూర్యుడు

సమయ పాలన సూర్యుని నుండి ఎందుకెవ్వడు నేర్వడు
ఏనాడైనా కవిగారూ ఇటూ అటొచ్చి ఎరుగడు



స్నేహమనే చెట్లను మనం చెరి ఒకటిగ నాటేద్దాం
కపటమనే కాలుష్యాన్ని కంప్లీటుగా తుడిచేద్దాం

సమైక్యతా సార్వజనీన సామ్రాజ్యాన్ని సృష్టిద్దాం
జగతిని కలుషిత మవకుండా ప్రగతిబాట లేద్దాం

గోళంలోని ఆయుధాలన్నీ గొయ్యి తీసి పూడ్చేద్దాం
శాంతి కపోతాల్ని కవిగారూ జగమంతా ఎగిరేద్దాం



వెర్రి వాడుగా కన్పించినా పోయేది లేదు
నోరు తెరచి వెర్రితనానికి ఋజువవగూడదు

రాత్రి కూర్చి నేనెరుగను రాత్రి వెళ్ళిపోయింది
ఉదయమా నీవు చెప్పు రాత్రి ఎచటికెళ్ళింది

అన్వేషణలో ప్రయాణాని కంతమదెక్కడిది
అడుగడుగున గమ్యం అదుగదుగో అనిపిస్తది

రాదా ఆమె జ్ఞాపకం రానే రాదు నెలల కొద్దీ
అథవా మరి వచ్చినదా అదే పనిగ బాధిస్తది

సుఖాల జల్లు కురిసేది చూస్తే కొందరి పైననే అది
దుఃఖాల వర్షాల్లోనే దొడ్డగ చాలమంది తడిసేది

గుండె సభలో నీవు లేక నిండుదనమే లేదు
కోటి దివ్వెలు వెలుగుతున్నా గోరంత కాంతి లేదు

వెలుగనుకున్నదే జీవితాన అంధకారం నింపింది
వింతగ చీకటులే కవిగారికి వెలుగు దారి చూపింది !



ఉత్సాహం ఒడిలోనే యువత పరుగు తీసేది
అది సన్నగిల్లిన నాడు యువత ఢీలా పడుతుంది

ఆత్మ విశ్వాసం లేకుంటే అసూయ పొడసూపుతుంది
అదే గాని ఉండినదా ఆపైన సాధించలేందేది

అంతరంగమే లేకుంటే అనురాగమున్నదే లేదు
అనురాగం లేకుంటే అసలే బాధా లేనేలేదు

కాలము ఓ ఆకొన్న కూతుడుగు పాములాంటిది
కర్కశంగ దేన్నైనా నమిలి మ్రింగి వేస్తుంది

వ్యాపారమదియొక తోపుడు బండిలాటిది
తోస్తుంటేనే తప్ప తప్పక అది ఆగుతుంది

డబ్బు విషయ మొదిలేస్తే మనిషీ పశువొకటనిపిస్తది
డబ్బు కూడా హతవిధీ మనిషిని పశువునే చేస్తున్నది

తిన్నింటి వాసాలనే కదా తేరగా లెక్కించగలిగేది
తిన్నగా కవిగారెంటే ఉండి దిక్కు మాయం చేసింది!



నెలకొక సబ్ స్క్రిప్షన్ నేను కట్టించానంటాడు
నెలకొక కవితా సంకలనం వెలయిస్తున్నానంటాడు

వినడానికే ఇదెంతో వింతగ కనబడుతున్నది
వినకుండేందుకు కారణమేదీ లేనట్లే తోస్తున్నది

కలమిలా నాట్యం చేస్తుండాలి గాని కవిగారికిక
కవితా సంకలనాలేం చేసాయి శతాధికం కాక !



పై పైబడి వచ్చే దుఃఖాలే బ్రతుకది కాబోలులే
ఆనందంలో మునిగినా అశ్రువులొచ్చేదందుకేలే

అమావాస్య బ్రతుకులలో అహరహమూ బేజార్లే
అన్ని బాధా వ్యధలకు అయె చిరునామా నాయిల్లే

ఎందుకు కవిగారూ మీరు కానంటారందరికి మళ్లే
ముందుకు పోతారా ఉన్నా ఇలాగే దారంతా ముళ్ళే !



మాటలలో పెట్టి పెట్టి నా బాటలోకి తెచ్చినాను
మరో నాల్గు రోజులలో మరుణ్ణయే చూపుతాను

నీవాకిట కాలిడిన నిలువుదోపిడీ జరుగును
నీకన్నా నిక్కమైన నిర్మోహి వేరెవరుండును

కలువొద్దని నీవంటే కలువను గాక కలువను
నీకలతకు కారణాన్ని చెప్పేదాక వదలను

నిర్మోహిని మోజునగని నిర్దయిని కరుణనేలొకని
నెట్టుకొస్తి జీవితాన్ని నేర్పనరా నామతాన్ని

ఆమె చేయి గుండెపైన ఆడుతున్నదీనాటికైన
కవితలలో నా గాయాలన్ని కన్పించెనేమో తనకేమైన

జ్ఞాపకాల నీ వెలుగుల ప్రాపకమది ఉండనీ
ఏనాడే మలుపులోన జీవన సంధ్యేతెంచునో

మరోసారి చివరిగా మహితంగా గౌరవించినా
భరోసా లేక కవిగారూ మరొక్కసారవమానించెనా!



కడకంటి చిరచిరలు ఉదయ సూర్యుని కాంతులు
విరబోసిన నీ నల్లని కురులు కాళరాత్రి మెరుపులు

పూదోటలలో వసంతాల పూవులవే మూటలు
తారకలూ చంద్రునిలో నీ గుజించే మాటలు

జగమంతా వట్టి తమాషా ఎవరు స్నేహితులూ శత్రువులు
నిప్పు మనకు వెలుగు నిచ్చు ఆ నిప్పే కాల్చు కదా ఇల్లు

హింసా దౌర్జన్యాలు పిరికి వాళ్ళ ఆయుధాలు
శాంతి సౌభ్రాత్రాలు జగాలనే అవి యేలు

చిన్ననాటి నుండి తెలుసు కొన్ని నాకు తారకలు
ఎచటి కెళ్ళినా అని నాతోనే వచ్చెడునంత ప్రేమికలు

దండి తుఫాను కారణాలు రెండే రెండు పెనుగాలులు
నాలో మెండగు యువత నీలో దండిగ అందాలు

పెదవులపై చిర్నగవులు అరికాళ్ళలో బొబ్బలు
కలవారే సుమా నిన్ను వెదుకు కవిగారూ నీవారలు !



సూర్యోదయ మనగానే కన్పడని చుక్కలు లేనట్లో
జ్ఞానోదయ మవకుంటే సకల బలుడుతానట్లా

నిత్యప్రళయమైన నిద్రకు మనం భయపడనట్లే
దీర్ఘ నిద్రకూ భయపడకుంటే వేదాంతులమన్నట్లే

ఒంటికి పట్టిందింతగా వేదాంతం కవిగారూ మీకెట్లా
ఓహో దయానంద సర్స్వతి ఆశ్రమంలో నేర్చారున్నట్లా !



సంద్రం నిండా నీళ్ళుంటేనేం దాని దప్పికే తీరదాయెను
నదులూ దాంట్లో కలువకముందే నల్గురి దప్పి తీర్చగల్గెను

చౌపదపాదాలను కుదించినస్వచ్ఛంద గజలు అష్లార్గును
గజలు షేర్లను త్రుంచిన చౌపదలై విరాజిల్లును

కావ్యాల్లాంటి రక రకాల జీవితాలనెన్నిటినో చూశానైనను
కవిగారూ దానికదే సాటిదైన మహాకావ్యం మీదందును!



చావాలి తప్పదు అయితేనేం చెప్పుదూ
ఆ సకల బలునితో ఐక్యమేకదా నేనగుదు

నడి సంద్రంలో నేను - నావ చుట్టూ తుఫానది
తీరము నేనెటు చూసినా దూరమౌతున్నట్లున్నది

జల్లెడలా మనసొక్కటి చిల్లులు పడ్డదున్నది
ఇల్లాళ్ళూ కావాలా మీకెంతగానొ పనికొస్తది

అదృష్టంగా బ్రహ్మ అదేనేమో తాను వ్రాసింది
అహరహమూ మోసం ద్రోహాలవే నాకు దొరికింది

ఏ కొమ్మన పూలెన్నో నేనెంతో మురిసి పొదిగింది
ఆ కొమ్మదె పువ్వొక్కటి నా గుండెలోన గుచ్చింది

స్వాతంత్ర్యం మనుషులకు బాధ్యతలను తెస్తుంది
అందుకే దానికి బాధ్యతా రహితులు జడుస్తోంది

ఒడి అంతా తడిసింది ఓ కవిగారూ ఇదేంది
మీ కన్నీరేనా ఇది దీన్నింతగానూ తడిపింది !



దేవుని ముందు కూర్చుని దినదినం మొక్కుకున్నా
దైవభీతి నాలోపల దండిగనే నిండి ఉందన్నా

అర్థిస్తే సకలబలుడు అన్నీ ఇస్తాడని కదా విన్నా
ఒకనాడిక నిన్నిమ్మని అడిగేస్తా మనుకున్నా

కోకొల్లలు న్యాయసూత్రాలు కోట్లే అవి ఉన్నా
న్యాయాలీ దేశంలో బీద వారలకు సున్నా

తామరాకుపై నీటిలా నేను కాలం గడుపుతున్నా
నిక్కంగా కైవల్యం పైననే నేను దృష్టి సారిస్తున్నా

పిడుగు చప్పుడెపుడెప్పుడు పిచ్చి పిచ్చిగ వినిపిస్తున్నా
పాపం పిచ్చుక గూళ్ళే నాకు జ్ఞాపక మొచ్చేనన్నా

ప్రేయసి చూపుల మధువు పెదాలతో పీల్చేస్తున్నా
అలలలాంటి ఆ హాయలును అలవోకగా జుర్రేస్తున్నా

నేను రాచుకుపోతున్నా నా ముఖాన్ని చూడకున్నా
కవిగారూ కాంతానికి కనికర మొస్తుందనుకున్నా !



ఇంత మబ్బు లేకున్నా ఇంట దీప మారిన వేళ
ఇంటి జ్ఞాన జనరేటర్ ఇట్టే కాంతి నింపె నెల్లెడల

ఏమీ లేకున్నా కొందరు ఎంతగనో సంతోషులు
అన్నీ ఉన్నా మరి కొందరనుభవించలేని అదృష్టహీనులు

అక్షర తూణీరం కవిగారిది అనంతంగా సాగే హేల
అజేయుణ్ణాయనను చేసే ఆ సకలబలుని/సరస్వతి లీల!



ఎంత హాయి బ్రతుకిది ఏ జవాబుదారీ లేనిది
ఎవరిని నేను నన్నెవరేదీ కోరనే కోరనిది

చిన్ననాటి కోరికొకటి చిన్నమంత మిగిలింది
తొలిశ్రావణ జల్లుల్లో తడిసి ధన్యమవాలనుంది

దేశం స్వర్ణోత్సవాలు దేనికై జరుపుకొన్నది
కవిగారూ గ్రంథాలయ వారోత్సవాలందుకే లాగున్నది!



బ్రతకడానికి కావలసిన మనీ తప్పక గడించాలి
మనీ కోసమే బ్రతుకనే తప్పు భావన వీడాలి

పనిచేసే వారెకదా ప్రపంచాన సమర్థులు
కూర్చుండి తినే వారికి గుట్టలూ చాలని నిజాలు

ఈర్ష్యాద్వేషాలను ఈ రెండుద్వేగాలు
ఆనందం యివ్వలేని అడ్డమైన అనుభూతులు

కొడుకులు తల్లిదండ్రుల కొండంత బంగారాలు
వారికో మాతాపితరులు కోడళ్ళు రాగానే శత్రువులు

అనాత్మ ఆత్మల ఆలోచనలనంతంగా వచ్చే సత్యాలు
అందుకే కలగలుపుగా ఆవిర్భవిస్తున్నవీ నాదాలు

నాలాగే నీ వేడుస్తావు నమ్మే మహో రాత్రాలు
నీ గుండె నా దగ్గర నిక్కంగా చిక్కుకుంటే చాలు

తొలి రాతిరి ప్రేమికుల కలవరాలు చూడాలి
కవిగారూ ఒకరు కావాలి వేరొకరొద్దనే ఆ కూడలి !



మనసును నీకర్పించి మచ్చలతో నింపినాను
దిన రాత్రులు వెలిగించి దీపాన్నే చేసినాను

సృష్టికర్త వైచిత్ర్యం చెప్పగలను నేనేమని
ఒక్కదారి మూతబడిన పెక్కు దార్లు తెరుచునని

నా సంతసమంతయునూ నల్గురికీ పంచినాను
నాహృది ఆవేదన మాత్రం నాలోనే ఉంచినాను !

మనసు విరిగినా కూడా పనిచేయడం మానేయునా
ఈ జగతిలో ఇంకేదైనా విరిగిపోయినా పనిచేయునా

ఎదురొక్కకుంటే నీవు పచ్చి నిజాలు కొన్ని
నిన్నెపుడో ఒకపుడవి వెన్నుపోటు పొడుస్తాయన్ని

ఎపుడేవేళ చోరుడింట జొరబడతాడోయేమోనని
తగని సిగ్గు వేస్తున్నది దండి దారిద్ర్యం కారణాన

పిడుగా నీవెక్కడ పడినా ఫరవాలేదుగాని
పిచ్చుక పిల్లలున్న గూటిపై పడకు విను కవిగారిని !



ముట్టుకుంటేకాల్చేది నిప్పు పట్టుకుంటే కూల్చేది అప్పు
కొత్తదైతే కరిచేది చెప్పు ఏమైనా చేయకూడందది తప్పు

భయంతో చేసుకునే ఒడంబడిక నివురుకప్పిన నిప్పు
ఏ ఘడియో ఏ దినమో ప్రజ్వరిల్లి సమరమై ఒప్పు

అనుసరపదాలతో భావాన్నిక్కిరి బిక్కిరిచేయడం తప్పు
తక్కువపదజాలంతో ఎక్కువ భావాలందించితే మెప్పు

ఆపుకుంటూ కన్నీరు అణచుకుంటూ నిట్టూర్పు
ఏనాడయ కవిగారూ ఈ బాధల కోదార్పు !



చెక్కిలిపై చుక్క కర్థం చక్కదనం తెలిసెనులే
ఘననీ అందాలకు కావలివాడు వాడనిలే

మీటితివా తీగనీవు మెరుస్తాయి మెరుపులే
అదే నేను మీటితినో కురుస్తాయి అశ్రువులే

బాహువు లామెవి కవిగారూ భలేగా కోమలాలే
వాటి యందు దాగున్నవి మేటి మేటి అందాలే



కంటనీరు నాపడం కాదు సుమా సాధ్యం
ఆనందంగా వున్నప్పుడూ అది కారుట సహజం

గృహస్థుగా ఉంటూ గొప్ప జ్ఞాన సాధన సాధ్యం
గృహస్థాశ్రముడా పరమ హంస మహా స్వామి నిజం

పెద్ద మనిషిగా పుట్టుట కాకతాళీయం మాత్రం
పెద్ద మనిషిగా బ్రతుకుట అగును మహాత్కార్యం

కాగితంపై కలం రాపిడి క్రాంతి శక్తికి దోహదం
అగ్ని జ్వాలల వెలుగుకన్నా అదియె ఎంతో ఉజ్వలం

కనులు విప్పితే జననం కనులు కప్పితే మరణం
ఈరెంటి మధ్య కాలం అదేలే మనిషి జీవితం

ఒకసారి పెళ్ళి పవిత్రం రెండోసారది తప్పిదం
మూడోసారి మూర్ఖత్వం ఆపై మరణ సదృశం

ప్రేయసి పెట్టిన ఆ దేవునిపైన ఒట్టు నిజం
దేవునిపైన ఒట్టు కవిగారూ మనోహరం !



మరువలేను మరువలేను మరువలేని మహానిజం
ఎవరిని నేనారాధిస్తానో ఆ ఆరాధన ఆజన్మం

అనురాగం పొందకనే అర్పిస్తుంటిని సర్వం
అది పొందినపుడు నాకడ ఇచ్చేందుకు శూన్యం

నారా చంద్రబాబు నాయుడు మనసీయం
రేరా జుగ చల్లగ ఈ రాష్ట్రాన్నేలుట నిజం

ఏకాకులమే ఐనా ఎక్కడుంది ఏకాంతం
ఎటేపు నాకు చూసినా పుస్తకాలే అనంతం

సూక్ష్మ శరీరమున్నంత సేపేలే జీవితం
స్థూల శరీరాన్నది వీడినదా ఇక మరణం

ఫిలమెంటు బాగున్నంత సేపే బల్బు తాను వెలగడం
అదే తెగిపోయినదా అపుడు తప్పంది మలగడం

వాన ఎప్పుడొస్తుందో చెప్పడం కాదు సుమా కష్టం
ప్రాణమెప్పుడు పోతుందో కవిగారూ తెలియడమే కష్టం !



భలే విఘ్న నివారక చవితి బహుమిన్న వినాయక చతుర్థి
ముగ్గురు గజ ముఖులున్నా మోదమీ గణనాయక తిరుతిథి

సిరి కావాలని గుండె సింహాసనానికి రాణిని చేస్తే
చేయగలిగిందేమి జలగై అదేగా రక్తాన్నే పీల్చేస్తే

ఇతరులననుసరించకుంటేనే కాడెవడు మంచి రచయిత
ఇతరులనుసరించ జాలనివాడే కవిగారూ గొప్ప రచయిత!



దినాని కొక్కనినైనా ఘనంగా ఆనందింప చేయి
అందులో సగం నీవూ అందుకుంటావు హాయి

ప్రతి ఒక్కడు తనకు తాను నిజాయితీ పరుడైతే
ప్రపంచాన అవినీతిని టార్చేసి వెతకాల్సిందే

మంచి మనిషి దొరకనేని మహితంగా అనుకరించుము
చెడువాడెదురయ్యేనా చెంతకెళ్ళడమే మానేయుము



సుందర సూర్యోదయాన్ని చూపగలడు చిత్రకారుడు
కుంచే రంగులతో కాన్వాస్‌పై అర్ధరాత్రి యందూ చూడు

నిర్మలమగు మనస్సాక్షే తెలియండి
నిద్ర ముంచుకొచ్చేందుకు నెమ్మి తలగడండి

అలిగిన స్నేహితుడు ఇల్లొదిలెళ్ళిన ఘన ప్రియుడు
పరుగులిడే జలపాతము మరలిరావాలెన్నడు

పురోగమనానికనే ముందు చూపిచ్చె సకలబలుడు
తిరోగమనం లక్ష్యకరిస్తే ఆ కళ్ళు వెనక్కే పెట్టేవాడు

తథ్యంగా తనను తాను తెలుసుకున్న ప్రతి ఒక్కడు
అన్యుల గూర్చి తెలుసుకోవడంలో ఏ తప్పూ చేయడు

చెకుముకి రాయితో నిప్పు చేసుకున్ననాటినుండి
చంద్రునిపై కాలిడు దాక నాగరికతదో మహాప్రస్థానమండి

పట్టణంలో ప్రతి రెండోవాడు తానోనటుడే
నమ్మికగా నమ్మగలిగిన వాడు కవిగారొక్కడే !



ఆటంకవాదుల వద్ద అనవరతం ఆయుధాలు పట్టేస్తున్నాం
ఆడుకోమంటూ ఆ బొమ్మలే మన పిల్లలకిస్తున్నాం

మంత్రిగారి యింటెదిగిన మహా మహా మూషికాన్ని నేను
మరీ చేదునిజాలీ కవిగారికైతలనెలా జీర్ణించుకోగలను

పూల వర్షమే కాలం జాలిగ నాకై కురిపించినా
కాలు నాది తాకగనే పూలేరాళ్ళై పోయెనేద్వనా

పట్టు పడదు కవిత్వ మొక్కటే ప్రజలందరికీను
సకల బలుని అంశా సంకల్పాలున్నోడే కవిగారంటాను!



స్వచ్ఛమైంది కాదా ఈ మనస్సు గౌరవించడెవడూ నిన్ను
తుచ్ఛమైన మనస్తత్త్వంతో సాధించేదెపుడూ సున్నా

ఒడ్డున కూర్చుని సరస్సులో ఒకటే రాళ్ళిసుర్తావేమన్నా
అది మంచి నిదురలో వున్నది దాన్ని సతాయిస్తావేలన్నా

అది చూచిందే కద అద్దం అంత నిజాయితీగా చూపును
అది లేదా కవిగారూ అద్దానికి ముఖం చూపడం తప్పేను!



చట్ట సభలలో మైకులూ కుర్చీలిరగ్గొట్టే ఘనులీ సభ్యులు
పుట్టు విలువల రహితులా దేశ ఖ్యాతి నిలిపే నాయకులు

ఆంధ్రాలో ప్రజలు అంతగా విశాల హృదయులు
అతిథి అభ్యాగతులను ఆహ్లాదపరిచే సన్మిత్రులు

సుతలూ, సుతులూ వారి పిల్లలూ సమృద్ధులే
తాతలు మాత్రమహో ముసలులైనా వృద్ధాశ్రములే

కలియుగంలో తండ్రీ తాతల ఋణాలను పుత్ర పౌత్రులు
తీర్చుకుంటున్నారాయేం చేర్పించి వృద్ధాశ్రమాలు

ఎదుటోళ్ణే చూసి నవ్వడం ఏహ్యామనెందుకు తెలియలేం
మనకా పరిస్థితి దాపురిస్తే మనమెలా సరిపెట్టుకోగలం

అందెగత్తెల మనసుల అందాలేవీ లేవేంనీలో
ఎందుకింక భూభారం చేరేదెప్పుడు నరకంలో

అటెళ్ళి వీరప్పన్‌ను కలిసొస్తున్నాడు గోపాల్ మళ్ళీ మళ్ళీ
కవిగారయా రెండు ప్రభుత్వాలూ పూల్సేనా ఏళ్ళకేళ్ళు?



అన్ని మంచి ఆలోచనలే నిన్ను చుట్టు ముట్టనీ
అనే వేద వాక్యమే ఆదర్శం సదా నీకవనీ

అవివేకితో చేసే చెలిమి కన్నను
వివేకితో శత్రుత్వమే మేలనిపించును

కలలన్నీ నిజమైతే కవిగారూ ఎవరైనా
తుమ్మెదల్లా ఝుమ్మంటూ తూలిపోదురేమైనా !



సకల చరాచరాలకు సకల బలుడే సృష్టి స్థితిలయుడు
కరుణ ప్రేమా సేవలతోనే తనను చేరు సత్పురుషుడు

ఎక్కువగా వ్రాసేవాడు ఎక్కువగనే మాట్లాడుతాడు
తక్కువగా ఏదీ చెయలేని దక్షుడనుకోవాడు

జాలిగుణం నవ్వుముఖం తనివివశం గుణాలీమూడు
ఆచరించేవాడు కవిగారూ అందరినోట్లో నలుగుతాడు!



ప్రకృతి గుణ ప్రేరణల వల్ల ప్రవృత్తులుంటా యంటారు
అవి మన వల్లే అనుకుంటే అజ్ఞానమే యేవంటారు?

గమ్యం కనుచూపు మేరలో కన్పించినా లేకున్నా కొందరు
దృఢ చిత్తులు వెరువక దీక్షతో ముందడుగేస్తుంటారు

గుండె విప్పి నేనందరినీ గౌరవించి మాట్లాడేతీరు
కొందరు మూర్ఖముగా నా నిజతత్త్వాన్నే శంకిస్తారు

కోట్ల జనాలు పుడుతున్నా ఏ ఇద్దరూ ఒకేలా ఉండరేం
కోట్ల కవుల్లా ఏ ఇద్దరి ఒక వాక్యం కలుస్తుందాయేం?

వెన్ను తట్టుట కన్న మిన్న లేదు ఏం మీరెరుగుదురా
ఎదుటి వాడి దృష్టిలో తెలుసా ఎంతగ మీరెదుగుదురో?

నిన్ను తెలుసుకోవాలనేదే నీ తపన సరా
నీవు సకల బలుడివనేదే నిశ్చయ నిజంరా

గజళ్ళెందరు వ్రాయలేదు గాలిబ్ కాలేదెవ్వరు
కవిగారికీ గజలు పిచ్చి మరి ఆయననేమందురు



ఒక్క క్షణం కోపాన్ని ఓరిమితో సహిస్తివా
ఓ నెల రోజుల దుఃఖాన్ని ఓడించావని ఎరుగుదువా

ఎవరికేమి ఇస్తున్నా చిర్నవ్వుతో జతపరచివ్వు
ఏమంటావు లేకుంటే ఇచ్చేది సగమన్నట్లే నువ్వు

తనువు నీవు కానే కావు తను మాత్రమే నీవు
అనిగ్రహించిన నీవే కవిగారూ ఆత్మ పరమాత్మవు



చెదఏమీ చేయలేదు చందన వృక్షాన్నని మన మెరిగింది
చెదకాదా వీరప్పన్ కర్ణాటక చందనాన్ని తినేస్తోంది

తోడులేదు నేడెవడూ నీడా వీడిపోయింది
దౌర్భాగ్యపు ఈ దుస్థితి నాకే ఏలదాపురించింది

ఏ పరిస్థితి కూడా ఎప్పుడలాగే ఉంటుందా
కవిగారూ ప్రతి రాత్రికో భానూదయముండు కదా ?



కంప్యూటర్ పరుగులివి తెలుగు భాషకో ంపముంచునేమో
తెలుగును వీటి కన్వయిస్తే తప్ప మనకీ ఖర్మ తప్పదేమో

దశాబ్దాల మన చదువులు దక్కించేనా ఓలంపిక్ మెడళ్ళు
చిన్నారుల బ్యాగులే చేయు స్కూళ్ళనే వ్యాయామం గుళ్ళు

తల్లి నాకీమెయని తెల్లమే ప్రతి ఒక్కరికౌనా కాదా
తండ్రి యెవరన్నదే కవిగారూ తల్లొక్కతే చెప్పగల నిజం కదా?

అసురీ ప్రవృత్తుల అంత మొందించడమనే ఆనందం ముందు
భౌతిక సంపదల్ని తృణాలని డబ్బు కాల్చేసేదే దీపావళి విందు

ఆరాధన ఒకేళ అసహ్యంగా మారిపోయిందంటే
అది ఎదుటి వాని ప్రవర్తన ఏహ్యంగా తను మారుటే!



సకల బలుడే బలంగా సర్వకార్యాలు చేయిస్తున్నాడు
స్వయం ప్రీతికే మనలనిలా తాను వాడుకుంటున్నాడు

భగవద్భక్తిని ప్రబలంగా నీవలవరచుకో
సంగములు తమంత తామే తొలగునని తెలుసుకో

పెద్ద గీతనొకటిని చిన్న గీతల ప్రక్కన గీసితివా
చిన్నవి దాని ముందు మరీ చిన్నవై పోవా

భగవంతుని సాక్షాత్కారానికి భక్తి మహా అవసరము
ఎంతగ ఆయన నారాధిస్తే అంతగ ఇతరుల ప్రేమింతుము

నీ కరుణామయ నిర్మల దృష్టినే నేను చూస్తున్నాను
నేనిక వెంటనే సకల బలా నీదరికి వచ్చేస్తున్నాను

భార్యా పిల్లలపై ప్రేమ పరాకాష్ఠ చెందడమే
భగవత్సాక్షాత్కారానికి పునాది వేయడమే

గొప్పవి సాధించాలంటే చిన్నవన్నీ త్యజించాల్సిందే
గోవిందుని పొందుటకై కవిగారూ కోర్కెలన్నీ వీడాల్సిందే!



బ్రహ్మ నిత్యం జగన్మిథ్య భ్రమనిపిస్తున్నది కదా
లేందున్నది ఉన్నది లేదను ప్రతిపాదనలా ఉంది కదా

ఇంతటి విశ్వాంతరాళాన్ని ఏదో శక్తి శాసిస్తుండాలికదా
దాన్నే మనం సకల బలుడు బ్రహ్మ అనుకోకూడదా

ప్రపంచంలో ప్రతిదీ కవిగారూ బ్రహ్మ కల్పితమైందే కదా
కల్పితమైందే దైననూ కలకాలముండంది నిజం కాదా



ఏ ఉచ్ఛ్వాసతోనైనా ఎగిరి పోగలదైనా ఊపిరి
ఏం విచిత్రమో ఆయన సంకల్పించందే పోదేం మరి

తొమ్మిది రంధ్రాలున్నా గాని ఈ తోలు తిత్తికి
తొంబదేళ్ళ దాకా ఊపిరి తొందరించదేం పోనికి

ఊపిరెప్పుడు పోవునో ఒకేళ ఊహించగల్గితే మనం
అప్పటి నుండే కవిగారూ ఆక్రోశిస్తుండేట్టి అవిటోళ్ళం



నేను పరమాత్మ స్వరూపుణ్ణే ఆయనా స్వస్వరూపుడు
ఈ గుప్త చిత్రము తెలిస్తే ఆయనే మనల కాపాడు

స్థూల శరీరాన్ని వీడిపోయినదా సూక్ష్మ శరీరం చూడు
ప్రాణం తుర్రుమన్నందున్న శరీరం కట్టెలా కనపడు

సప్తర్షుల ప్రశ్నలకు సమాధానం "తనకు తెలియదన్నాడు"
ఆ సకల బలుడే అపుడింక మనకేం తెలుసునని

తనదికాని దాన్ని తనదని భ్రమించుచుండు
తనువది అటుల మనచే తప్పులు చేయించు చుండు

నాకతి విశ్వాస పాత్రులు నాకారూ స్కూటర్‌లు
పాతికేళ్లు పైబడుతున్నా ప్రాబ్లమివ్వని నమ్మకస్తులు

ఏమైనా ఈ సృష్టిలో ఎవరెవ్వరూ మార్చలేరు
మనం మాత్రం మారాలనుకుంటే మరెవ్వరాపలేరు

గుండెలో ఊరుతున్న ఈ నాదాలు కవిగారూ
ఎలా ఆపగలరు తోడుటుండటమే మేలు చూశారూ!



గెలిచేదాక జీవిత పోరాటమాపలేకున్నా
చచ్చేదాకా పోరాడుతుండడమే మిన్న

తెలియని అన్యమైనవాటన్నిటినీ తెలుసుకుంటున్నావు
తెలుసుకోవాల్సింది నీ గుణించన్నది విస్మరిస్తున్నావు

నీవెవరికోసం బైట జీవితాంతం వెతుకుతున్నావో
ఆతను నీలోనే నివాసమున్నాడనెందుకు తెలియవో

తల్లిదొక్కటే ప్రేమము తండ్రిది గురు రూపము
గురు విచ్చేదే జ్ఞానము సకలబలునిదే కారుణ్యము

మానవజన్మ మెత్తడం మహాదుర్లభం చూడు
మరి దాన్ని ధన్యపర్చుకోవా అపరాధమే కడు

అన్ని ఆలోచనలు మానుతున్నాను చూడు
ఆ సకల బలునినే నమ్ముకున్నాను నేడు

ఈ సాహితీ సేవ పూర్తవ్వగానే ఒకనాడు
వెళ్లి కవిగారు ఆ సకల బలునిలో లీనమౌతాడు !

సమాప్తం

# URDU POETS' TRANSLATIONS

ఖుదానే అడుగు మనసా తనే అవసరాల్తీరుస్తాడు
మనసులోని నీ కోరికలు ఫలించేటట్లు చూస్తాడు

నీ అదృష్టం చిన్నదనుకోకు నీవందుకు బాధపడకు
అన్ని నీ రోగాలు కుదిరేట్లు అమృతమిస్తాడు నీకు

నాపై అధికారాలన్నీ నీ అధీనమందున్నాయి
ఏవిధి అనుగ్రహించినా అదేలే నాకు హాయి

నీ రెప్పలు రెండు మూర్తులు నీ కనులే దేవాలయం
నేనే ఆ గుడి పూజారిని నీ పూజే నా పని నిజం

ఈర్ష్యాళువులా ప్రేమికులీనీ అందంకై పోట్లాడెదరు
నీ దివ్య బుద్ధితో విచారించి నిర్ణయించువారి అదృష్టాలతీరు

నీ ఆలోచన ఒక్కటే సదా నా గుండెనాడించే ప్రాణం
ఏదీ దూరం చేయలేనిది ఈనా అమందానందం

ప్రవక్త మొహరును గుండెపై ప్రదర్శించినప్పటినుండి
అనంతంగా పారుతున్నదాయనకరుణ అన్ని మూలల నుండి

నీ ప్రేమ అద్భుత కుసుమం, నా హృదయాన పూచింది
మత్తైన దాని సుగంధం నన్ను చిత్తుగా మూర్ఛిలచేసింది.

Contd...

అర్ధమంటి నా హృదయంలో అమరెనందంగా నీ రూపం
దుఃఖమంతా దూరమాయె పరిచె దారంతా బంగరు పళ్ళెం

శత్రువు దుడుకుతనానికి ససేమిరా వెరవనునేను
నా దీపానికి కాంతి తాను నమ్మికగా ఖురాన్ షరీఫేను

నీవో గొప్ప సూర్యుడివి నేనా చిన్న ధూళి కణాన్ని
నీవిలా అనుకోకున్నా మానీకిచ్చేది నీవే ఆధారాన్ని!

- మొహమ్మద్ ఖులీ ఖుతుబ్‌షా



ఆకాంక్షలు నావన్నీ అయిపోయాయి ఖననం
ఆ కోరిన నా లేమ అయెనితరుని ప్రేమం

ఇంకెప్పుడూ ఏ తరుణి ఇంద్రజాలంలో ఇరుక్కోను
మంచే అయెనల్లా కొంచెం ముందే రక్షించెను

అతిథిగ వచ్చింది తన హావభావలెరపెట్టింది
దోచి నన్ను అన్ని విధాల దుర్భాగిని వెళ్ళిపోయింది !

- డా॥ మొయినుద్దీన్ షాహీన్

కవిత్వమంటే వారిదే కవితలంటేనూ వారివే
రాగం తానం పల్లవుల రంగులంటేనూ వారివే

కవితా లోకంలో నిండిన అన్ని కళాకాంతులు
మెరుపులతో బాటుగ వెలుగులన్నీనూ వారివే

వారి గొంతుల్లో గజళ్ళది భూరి గంధర్వ గానమే
వహ్వా ఆ తీపి పదలాలిత్యాలన్నీనూ వారివే

ఎంత చూడముచ్చట ఎందరెందరని ఆరాధకులు
వారి ననుసకరించగలిగినచో మహా కవితలన్నీనూ వారివే

ఏ శ్రేణి కవులు వారు ఎంతెంతెత్తులందున్నారు
సకల బలుడు మెచ్చి యిచ్చిన సత్కీర్తులన్నీనూ వారివే

మీరు గాలిబుల సమకాలీనులకు తెలుపండి
కవితా కాంత నుదుటి తిలకాలన్నీనూ వారివే

అన్ని శతాబ్దుల కవులూ మీరూ గాలిబ్‌లేలే
గత శతాబ్దులు వారివే వచ్చే శతాబ్దులూ వారివేలే

మీర్ గాలిబుల కవితలే ఎప్పుడూను మునవ్వర్
ఈ ఖ్యాతి ప్రఖ్యాతులు వర్తమానాలన్నీనూ వారివే

\- వేడమ్ మున్వరున్నిసా మునవ్వర్

ఏమి నా నేరము దానవా ఇంత ఘోరంగా చంపావు
ఎందుకు నన్నిలా అర్ధాయుష్కును నీవు చేశావు

నిదుర లో ఈ రీతిగ నిర్జీవిని చేస్తావని తెలిస్తే
నిదురే పోకుండా నేను నిన్నాటాడించేదాన్నే

ఎంత ముద్దుగా పెంచిందిరా మా అమ్మ నన్ను
సుంత నీ ప్రయోజనంకై బలిచేస్తావారాదున్న

క్షణికమైన నీ ఆనందానికై నా ప్రాణాన్నే తీస్తావుర
నీ మనోల్లాసం ఆదాయంకై నన్నే చంపేస్తావుర

చూడరా నా చర్మమెలా వాడి వాడి పోతున్నది
నా తోబుట్టువు ఎలా నాకై విలపిస్తున్నది

జంతు ప్రదర్శన శాల అంతా కళావిహీనమైనది
జంతువు కన్నా హీనం నీ బ్రతుకంటున్నది

నేను నీవు అందరూనూ నశ్వరమే ఒకనాడైనా
ఆయుస్సు నడుమన సాక్షీ అంతం ఘోరనేరమేమైనా !

- అఫ్షాన్ బానూ ఆదిల్

ఎపుడు చితికి పోయానో ఎపుడెపుడని చెప్పను
ఎవరీ స్థితి కీడ్చారో ఎవరెవరని చెప్పను

నా చిరునామాయే నేనిపుడు చెప్పలేను
ఇతరుల చిరునామాలే రీతిని చెప్పగలను

సంతసాలు నావన్నీ చింతలే తామయ్యేను
చింతలలోని చేదుమజా ఎంతెంతని చెప్పను

నెత్తురు ముద్దలపై నా కన్నులు తామున్నవి
హంతుకుడెవరంటే ఆహాయేమని చెప్పను

కుశలమా అని నన్ను కోమలి తానడిగితే
తన ఆలోచనలలో మునిగిన నేనేమని చెప్పను

ఆరిపేసి తానే బోరుమనేడిస్తే గాలి
ఆ దీపాల గోడు నేనెంతెంతని చెప్పను

నా కవితలు ఎందుకింత నాణ్యంగా ఉన్నవంటె
నా కనులెదుటే ఉన్న అందం తానెవరని చెప్పను

వసంతాన్ని తనతో వహ్వాతాను తెచ్చినపుడు
పూదోటలవెంతెంతగ పులకించాయని చెప్పను

గుప్తంగా నా చెవిలో గుస గుస తానసిగితే
నాకే వినబడదాయె అహో మీకేమని చెప్పను

నాపై నాకే సయీాద్ కోపంగా ఉన్నప్పుడు
ఎందుకు నీపై కోపమంటే నేనేమని చెప్పను

\- కీ॥ శే॥ సయీాద్ షహీదీ

ఏమి ఏమేమి చూస్తున్నాము
ఎన్నడూ చూడనివి చూస్తున్నాము

ఎదుటి ఆసామీ ఇల్లే కాలుతున్నా
ఏమీ పట్టనట్లుగా చూస్తున్నాము

భోరున కుంభ వర్షాలు కురుస్తున్నా
నీరే లేని నదులు చూస్తున్నాము

నావ స్నేహితులదే మునుగుతున్నా
నాకేంలే అన్నట్లుగ చూస్తున్నాము

అద్దం ముందే కూర్చుని ఉన్నా
ఆమె వదనమే చూస్తున్నాము

పూలువాడి ముళ్ళేడుస్తున్నా
పొంచివున్న కాలుష్యం చూస్తున్నాము

సభల కళా కాంతీ సయ్యాద్‌ను
ప్రభయే లేకుండా చూస్తున్నాము !

- కీ॥ శే॥ సయ్యాద్ షహీదీ

ఏ కీలును ఎచట విరచాలో ఖాకీలకు తెలుసు
ఎవరి కాళ్ళలో బొబ్బలెన్నెన్నో బేడీలకు తెలుసు

నేనా ఒక పథగామిని నన్నెందుకులే అడుగుతావు
దారి నా గమ్య స్థానాలది దూరాలకు తెలుసు

ఆమె నాకు హృదయేశ్వరి ఆమె చరితనన్నడగకు
మమతల బ్రహ్మానందాలు మధుర గానాలకు తెలుసు

ఋతువుల స్వభావాలు మతికెక్కని మహా నిజాలు
గాలుల రిమ్మ తెగులు గట్టి కొమ్మలకు తెలుసు

ఎవరి ఉద్దేశ్యాలు వారివి మీ సలహాలవసరమా
ఏ పూదోట నెన్నుకొనాలో పిడుగులకు తెలుసు

మొగ్గలతో పూవులతో మోహమామెకు స్వభావికం
ఎంత హృద్యమో వసంతం సీతాకోక చిలుకలకు తెలుసు

ఎవరెవరొచ్చారో తోటలోనికి ఎందుకు మనకామతలబు
ఎవరి అడుగు లేవేవో అని పిల్ల బాటలకు తెలుసు

నీ సొద యెందుకు మధ్యలో నీకేమి తెలియదూరుకో
ఎవరు నన్ను తలుస్తున్నారన్నది ఎక్కిళ్ళకు తెలుసు

అవినీతికి తామే అవతారాలైనోళ్ళందరినీను
ఎంత కాలం భరించాలన్నది ఆ కుర్చీలకు తెలుసు

ఎన్ని రహస్యాలో బుద్ధులలో ఎలా మనకు తెలుస్తాయి
ఎవరి బుర్రలో యేముందన్నది తలపై టోపీలకు తెలుసు

Contd..

అందరినీ అలరించే అందమైన నవ కవితలు చేస్తున్నా
నయ్యర్ గజలు ఆంతర్యాలతి సుందరులకు తెలుసు !



నడవకు నా తోడ్తోడన నష్టము నీకౌనేమోయి
నా కోసము నీవెందుకు చికాకై పోతావోయి

నేనో పరదేశిని యేదో ఓనాడేళ్ళాల్సినోణ్ణేగా
అతిథేయుడవు నీవైతే చాలు నాలోచించుకోవోయి

కాలమెలాగూ పట్టునో కింత నయ్యర్ పశ్చాత్తాపానికి
గుండె తాను గొప్ప నిగర్వైనా పశ్చాత్తాపపడులేవోయి !

- సలాహుద్దీన్ నయ్యర్

ఆరాలేవీ తీయకనే ఆమెను నే కలుసుకున్నాను
తొలి ఆ పరిచయంలోనే తొందర పడిపోయాను

అమాయక అందగత్తెల్లో మోసగత్తె అనుకోలేదు
పరువునాది ఈ రీతిగ బజారు పాలౌననుకోలేదు

ఎంతనా గుండెను ఇంతి బాధించిందనుకొన్నారు
కన్నీరే కనులనుండి వర్షాల్లాకారావంటే నమ్మరు

నంగనాచి బుంగమూతి ఓ నమ్మక ద్రోహినీవు
నాకిచ్చిందేంటే ఆజీవిత దుఃఖం తప్ప చెప్పి ఏడువు

వేచినాను బ్రదుకంతా అమ్జద్ వెర్రిది దారికొస్తుందని
ఏ రాత్రన్నా గడుస్తుందని ఎపుడో ఉదయమొస్తుందని

- బషీర్ అమ్జద్

గమనం నిర్దేశించినవాడు గమ్యస్థానమూ చూపుతాడు
కమనీయం బ్రదుకును ఆ ఖుదా తానే కదా చేయగలడు

అడుగడుగున తన అనుశాసనాల నాదేశిస్తుంటాడు
అన్ని జీవిత మలుపులలో కొన్ని చమత్కారాలు చేస్తాడు

కారు చీకటులు నా చుట్టూ కమ్మేస్తున్నా సకలబలుడు
చిరు దివ్వెనొక్కటి వెలిగించి చీకటులు తొలగ చేస్తాడు

ఎదలో ఏదో ఒక ఎదురు చూపును సృజిస్తాడు
అది పొందేందుకు దారులలో తారలనే నిలుపుతాడు

ప్రోద్భుల ప్రోత్సాహాలలో పూర్తిగ నన్ను ముంచేస్తాడు
కలలు నేను కనబోతుంటే తను తట్టి లేపుతాడు

అందరికీ మంచి చేసిన తానను గ్రహం చూపుతాడు
అదే చెడు చేసిన తన ఆగ్రహమూ కురిపిస్తాడు !





నా మనసామెకు తెలిసింది నాకదే సంతసం
నా అద్దమామె చూచుకుంది నాకదే సంతసం

ఎలా గడుస్తుందో జీవితం ఏమీ తెలియదు
ఎలా గోలా నడుస్తుంది జీవితం కదా అదాగదు

కలలెవ్వరివీ కల్లలవక తప్పనే తప్పవు కదా
నిదురోయిన ప్రతి ఒక్కడు మేల్కొనాలి తప్పదు కదా

గాలులతో మీరీరీతిని గోల చేయడం దేనికి
బూదికదా చెల్లా చెదరై పోవడమే సహజం దానికి

ప్రయాణానికి కావలసిన బట్టలు లేకున్నా మాత్రమేం
ప్రయాణించేందుకు తగిన దమ్ముంటే చాలదేం ?

-ప్రొఫెసర్ మోహ్సిన్ తబస్సుమ్

పడుతూ లేస్తూ దార్లు తప్పుతూ ప్రయాణించాం
మళ్ళీ చివరికెలాగో మహారాజ మార్గమే మేం చేరాం

రాతి గుండె చీల్చుకుని మరో రాయే తాను బైటికొస్తే
రమ్యంగా ఉండేది కదా ఏమైనా విగ్రహానికి బదులు

ఏడేడు పరదాలలో ఎంతగనో దాగున్నా వారు
ఋతువది మారంగానే బోడితలతో కన్పించారు

బుద్ధుల అజ్ఞానంతోనే భూరిగ విభేదాలు వచ్చును
అది అంతేలే అనుకుని నేనచటి నుండి వెళ్ళాను

మన వాళ్ళేలే అని అనుకున్నవాళ్ళే మన సమస్యలు
ఈ సమస్యలవి ఇంటింటా వున్నట్టి మంటి పొయ్యిలు

ఈ పట్టణం మాత్రం ఇదేమీ వేరుకానే కాదండి
ఎదురు దెబ్బ తగిలినదా కాలుకది పుర్రే అనుకోండి

అణువును ఛేదిస్తే వెంటనే అచటో ఎడారి మొలకెత్తును
నీటి చుక్కను విడదీసినా అదీ అంతే భయంకరమేను

రొట్టె ముక్కకై మేము గట్టిగ ఏడుస్తుంటే ముజ్తర్
మిత్రుని కంచంలో కూడా మేము కంకరలే కన్నాము!

ముజ్తర్ మజాజ్

మంచి మనస్సుల కథలను మాకు చెప్ప ప్రయత్నించకు
మనస్సులు మంచివైన వాళ్ళు మనకిక లేరని మరువకు

గట్టి గాలులకు మలిగే చిట్టి దీపాన్నను కొన్నారా నన్ను
గాలులూ చూపెట్టండి మీ జోరు తిని పోతారు మన్ను

చెప్పనేమి ప్రతి ఒక్కనివీ చిత్ర విచిత్రపు ఆలోచనలు
షౌఖ్-ఈ అతి మర్యాదలే నాకౌతున్నవి మహా దండనలు!

- ఖాజా షౌఖ్

పిల్లలు లేనటువంటి ఇళ్ళల్లోనికి
వేల్పులు కూడా వెళ్ళరా జోలికి

బంధుమిత్రులెవరూ పోరు కొన్నిళ్ళల్లోనికి
ఎండిన చెట్లమీద పక్షులెలా పెట్టునునికి

జ్ఞాపక మొస్తే మేము కార్డు వ్రాసి పడేయండి
మొహిసిన్ ఉండే చోటికి యేదార్లో పోవండి !

- మొహిసిన్ జల్గాంవీ

జీవితమా నాపై కాస్త చల్లని నీ చూపుంచు
అందగత్తెలభిలషించునట్లుగ-ఈనా రూపుంచు

ముళ్ళమీద నడుచునట్టి మొండి గుణం మొనగాడే
పూలదాకా చేయిచేర్చ గలిగినట్టి మొగవాడే

నవ్వేడ మన్నదదేమైనా నా నేరమైతె మిత్రులార
నెత్తురు కన్నీరును చూసే నేర్పు కలిగుండండిర

ప్రసంగం పూలగూర్చి ఎచటెచటది వచ్చినను
ప్రేయసీ నీ ముఖమే నా కనులముందు నిలిచేను

నీ కోసం ప్రియసఖీ యే సాహసమైనా చేస్తాను
కాదన్నావా ముసినవ్వు నవ్వుతూ విషమెట్లా తాగెదను

ఇంకయునూ ఓ రయీస్ ఎవడికేమి కావలెను
పొంకమైన గజలుకే పూర్తిగా వారసుడైతేను

- రయీస్ అఖ్తర్

గాలి ఉధృతం నల్దెసలా గట్టిగట్టిగా సాగెను
గుడారాల వెన్నెన్నో కుప్ప తెప్పలుగా కూలెను

తనువు మంట కూడా దావానలమై తోచును
ఏకాకిని ఆ మంట ఎంతగానొ ఏడ్పించును

అపార్ధాలు మా మధ్యన అనంతంగ తావయ్యెను
దిండులు రెండు వేర్వేరయే దీన స్థితి ఐపోయెను

ఇంటనొక్క అవతారం బైటింకొక అవతారమామెది
ఎదుగలేదు మనిషిమాత్రం అదో వ్యూహలోకమామెది

అలసి సొలసి ఆలస్యంగా ఆఫీసు నుండింటి కొస్తినా
కాలూనక ముందే మొదలగు కాకి గోల వినగలనా

పల్లపు ఇళ్ళతోపాటు ప్రజలూ మునిగి పోయారు
ఈసారి జల ప్రళయం స్వామీ ఎంతెంతనుకున్నారు !

- అసర్ ఫౌరి

కాలం మనదీ ఇతరులదీ
మండుటెండా మఱియు నీడా ఇది

ఏడ్చేవాళ్ళను కాలం నవ్విస్తుంది
నవ్వే వాళ్ళనిదేడ్పిస్తుంది

స్నేహితులను కాలం విడదీస్తుంది
చిత్రంగా విడినోళ్ళను కలిపేస్తుంది

విరహ గీతాలనూ వినిపిస్తుంది
సంతస రాగాలనూ పలికిస్తుంది

కాలం వసంతం రూపానా వస్తుంది
అదే ఆకురాలుటాలూ చూపిస్తుంది

కాలం చీకటిగానూ మారుతుంది
వెలుగు తానై మెరిసిపోతుంది

కాలమాపదలూ తీసుకొస్తుంది
ఆనందాలు తన వెంట తెస్తుంది

ఆశ నిరాశలనూ కలిగిస్తుంది
అనేకానేక తమాషాలు చేస్తుంది

కాలంపై కన్నుంచే వాడికి షేఖ్
కనికారమూ అది చూపెడ్తుంది!



చీకట్లు ముంచుకొస్తే ప్రేమ దివ్వె వెలిగించాలి
అలిగిన ప్రేయసిని బుజ్జగించి ఔననేట్లు చేయాలి

మనసు విరుగ గొట్టడానికి మనకో నిముసము చాలు
దాని నదుకు పెట్టడానికే దండిగ సమయం కావాలి

పిడుగు తాను పడుతుంది పిచ్చుక గూడుపైనే చూడండి
కాని తోటలో ఓ భాగం తానూ పోతుంది కాలి

ఆలోచనలందరివీ అవి ఒకే రీతిగానున్నాగాని
మన మధ్యన దూరాలివి ఇంతగ ఎందుకుండాలి

వసంత ఋతువు ఘనంగా వచ్చే వేళయిదేమో
ప్రతి రెమ్మను పూదోటన అతిగా వూగించుగాలి

హైదరాబాదు ఆతిథ్యం అందరికీ ఆనందం
ఇక్కడ అతిథైతే ఓనాడు ఇంకపోలేడీ వూరొదిలి

మనసులోనిదీ మాట మహితమా కాదా షేఖ్
మన నుదుటున వ్రాసింది మన కదెవడు తప్పించాలి!

- మోమిన్ ఖాన్ షేఖ్

ముఖాలేమి మాట్లాడును మిత్రమా
గుండెను గుండెతో నీవు కలుపుమా

ఇప్పటికైనా కనులను తెరువు
చూడు ప్రపంచం తెలుసుకో నీవు

మనసులో దుఃఖమేల నింపుతావు
దుఃఖాన్ని కరిగించి కన్నీరుగా ఏడువు

గుండెలోని చేదే ఘోరమైన కాపట్యం
ప్రేమయనే చక్కరనే పంచిపెట్టు నిత్యం

అబద్ధాల ఈ జగతిలో అశాంతియే మెండు
అందుకనే నీవసలు అబద్ధమే ఆడకుండు

నాల్కను నీ అధీన మందుంచుకో షేఖ్
తూచి తూచి మాట్లాడుము తోచినదెల్లా పలుకకు !





ప్రేమ జ్యోతులెలిగిస్తేనే కదా ప్రయోజనం
అదృష్టమాలింగనంచేస్తే అంతా మోదం

మత్తు కనులపై రెప్పలనే ఆ చిల్మన్లు
ఎంత మెల్లగా తొలిగిస్తే కనులంత కాంతులు

మధుశాలలో మధుపానం మరీ పాత ప్రక్రియ
నీ నయనాల సుధాపానమే నాక్కావాలి సుప్రియ

కనుచూపుల దారులే కడు దగ్గరి దారులు
ఆ దారిన వచ్చి కురిపించు ఆలింగనం మరులు

సభలో హరం చేసే ఆశలలా కవీ షేఖ్
చక్కని మరో గజలినిపించి తీర్చు మాజౌఖ్ !

- మోమిన్ ఖాన్ షేఖ్

ఎన్ని తుఫానులని నవ్వుతూ ఇలా దాటేస్తావు
జీవితాన్నిలా నడిసంద్రంలో ముంచేస్తావు

స్నేహితం తప్పదులే ఏనాడెపుడైనా
జీవితంతో భయపడి నీవేం సాధిస్తావు

పెదవులనే మేమింక కుట్టేసుకున్నాము
రాతివి ఇంకే విధముగ నాతీ బాధిస్తావు

రాగల వాడెవడైనా రాస్తాలో ఆగుతాడా
ఎంత సేపని కిటికిలో నుండి ఎగిరి నీవు చూస్తావు

డబ్బు బలములు ఏ మంచి పనినీ సాధించనే లేవు
ప్రేమ తోడ సాధించని పనదేదుందంటావు

నీవూ ఒక ఇంటోడివి కావోయి రషీద్
ఎన్నని ఇండ్లను ఇలా పిల్లికూనల్లా మారుస్తావు !

- రషీద్ జలీల్

హొయలులన్నీ ప్రేయసివి హృద్యంగానే తోచెను
హంతకి పోలికలోనూ అంత శృంగారంగానే ఉండెను

అందాలకు సాష్టాంగం అర్పించాలని పించెను
భవబంధాలందరివీ నావిగానే అనిపించెను

ఊహలలో తానెంతో ఉత్కృష్టంగానే ఉన్నను
కంటపడీ పడగానే కలలాగానే తోచెను

నా కోర్కెల నగరంలో నానా దివ్వెలెలిగించాను
పట్టపగలే ఐనా దిట్ట చీకటిగానే అనిపించెను

నా క్రీనీడలె నా హృదయం గోడల నెల్లెడలాను
నా వాకిట ఎండ కూడ నీడగానే తలపించును

బాణాలవి నీ మరులవి బాధిస్తునే ఉన్నను
అది కూడా నీ వలపుల ఆహ్వానంగానే తోచును

అన్ని బాధలు హసన్ చిష్తీకి కమనీయాలైనను
ప్రేయసి బాధ మాత్రం మరీ ప్రేమముగానే తోచును !

\- హసన్ చిష్తీ, షికాగో

నగుతూ నగుతూ తెగపోరాటం అందరితో నయేది కాదు
హక్కులకై రొమ్ము చూపుట అందరితోను అయేది కాదు

ధర్మమెవరినీ తట్టి నడుపునో అట్టి వారలే అర్హులు దీనికి
మంటలలో పూలు పెంచుట అందరివల్ల అయేది కాదు

మేలు కొల్పితిని గజళ్ళతో ప్రజా వాహినిని ప్రతి చోట
మాటలతో తుఫాను సృష్టి అందరి వల్ల అయేది కాదు

సుడి గుండాల్లో సొక్కి సొక్కి నే వడివడి తీరం చేరితిని
అలలతోడ చుక్కాని చేయుట అందరివల్ల అయేది కాదు

అందరినీ నేనక్కున చేర్చెద ఆనందంతో పొంగి పోయెద
శత్రువుతో ఓ అన్వర్ స్నేహం అల్పులతోడ అయ్యేది కాదు!

- అన్వర్ హయత్, హన్మకొండ

ఆమె వెళ్ళి ఎన్నో ఏండ్లు పూండ్లాయెను
ఆ జ్ఞాపకాల సుగంధాలింకా వీడవాయెను

గుండెలలో రాజుతున్న ఈ మంట లింకేమి ఆరును
గాలులు ఎడతెగకుండా గట్టిగ వీయసాగెను

సభలో ఎన్నెన్నో చక్కదనాలు కూర్చొనున్నా
ప్రేయసి వెలితితో బియాబానీకి ఉక్కపోతగా నుండెను!

- బాసిల్ నక్వీ బియాభానీ

పోటీ స్వర్గాలవి పొలతి అందాలైతే ఒరిగేది నాకేం
పొందాలంటే పరిష్వంగం పూర్తి శోకమైతే ఒరిగేదేం

పుట్టు మచ్చలా అది పోనే పోనిది కదా సదా
గుడి గోడైనంతగ గుండె మెరిస్తే నాకేం

ముక్కలై పోతి నేను ఇంకెక్కడుంది నా అస్తిత్వం
అణువణువుది అల్లుకునే గుణమైతే నాకేం

అంతగ కూలిన ఆశల గోడల ముందు
నిరాశయ్యై నా శోకం నిలబడితే నాకేం

ఎంత పిచ్చినాది దుఃఖం మ్రింగి ఆనందం పంచేది
ఇది కూడా కుమతికి బాధైతే నాకేం

బాసిత్ కాలేదంతము ఇంకా మోసపు పీడలు
కలం శైలి ఇంకెంతగ కాలిపోతే నాకేం !

\- బాసిత్ నఖ్వీ బియాబానీ

ఏకాంతపు ఈ దినాలు యే రీతిగ గడుచునండీ
గోడల నడగండీ లేక తలుపులూ గొళ్ళాలనడగండి

ఎప్పుడు నాపైనే పడతాయి ఈ పిడుగులదేమోనోయి
నన్ను మాత్ర మడగవద్దు నా అదృష్టాన్నడగండోయి

వాతావరణం గుఱించి వహ్వా శాస్త్రజ్ఞులకేం తెలుసు
మేఘాల్లా కదలాడే ఆ మేలి సుగంధాల కురులకే తెలుసు

సూర్యకాంతి ఎంత సేపొ సోగ్గాణ్ణి నన్నడిగేం లాభం
క్రుంగుతున్న ఆ సూర్యుని కొంచెమాపి అడుగు నేస్తం

ఎక్కిళ్ళంతగ నాకెపుడూ ఈ రీతిగ రాలేదు సుమా
ఈ సారామే నన్నింతగ తలుస్తున్నదెందుకో చెప్మా

వసంతృతువుకై షహామత్ వాహ్ రే నీ వెదిరి చూస్తున్నావు
వాసంత సజ్జికపై లతాంగి వహ్వా నీ వేల చూడకున్నావు!

- ప్రిన్స్ షహామత్ జాహ్

శత్రుత్వ మనేదేమైనా శతధా విషతుల్యమే
మిత్రత్వం మాత్రమేమి మొత్తంగా నమ్మశక్యమే

కర్రపడవలే అన్నీ సంద్రంలో వెర్రి తుఫాన్లో చిక్కుకున్నవి
ఒడ్డంతా ఎటు చూచినా ఒకటేగా మంటలు కమ్ముకొన్నవి

వినయశీలి ఈ భూతలమెప్పుడు వినా వినాశము
గర్వించే ఆ ఆకసము కాదా అదెపుడూను శూన్యము

అందమైనవా ఎండమావులు అదిగదిగో ఆ చావుతాను
మనం వెంట పడే దొకటైతే మన వెంట పడేదొకటీను

పూల పొన్నుపై ఎండ ముద్రికలు చూడు ఖుతుబ్ సర్దార్
పోలిక లచ్చం గుండెమీద బాధల క్షయ మచ్చలలా సార్

\- ఖుతుబ్ సర్దార్

ఆమె కురుల నీడల్లో అమితంగా ఆహ్లాదమాయె
తెల్ల బడినవా రేపవి చల్లదనమే కరువాయె

ముళ్ళన్నీ వేరి పారేయండి ముద్దుల ప్రేయసి దారి నుండి
పూలను నేను పరుస్తాను పాలతి కెట్టి బాధొద్దండి

ఇద్దరూ ఇద్దరే కదా యే మాత్రం తీసిపోరు
ఒకరిది గుండె ధైర్యమైతే ఇంకొకరిది బండతీరు !

- అబ్దుర్రజాక్ షైఖ్

నవ్వుతూ నవ్వుతూ నీ ఊపిరి పోయిందా
చిరునవ్వే నీ పెదాలపైన చిందేస్తూ ఉండదా

ప్రేమలోన మామూలే మనం కన్నీరోడ్చుట
కాస్త నవ్వుతూ కారిస్తే చూచేవారి కూరట

ఎక్కడి కెళ్లాల్సుండేనో నాకు ఎక్కడికో వచ్చాను
నవ్వుతూ నవ్వుతూ చూశారా నేనెంత పనిచేశాను

- తౌఫిక్ అన్సారీ అహ్మద్,
అమెరికా

గుండె మంట లార్పేయాలి
జ్ఞాపకాల బూది కడిగేయాలి

ఎందరని మా సౌందర్యోపాసకులు
ఎందరెందరినని నేను వేరేయాలి

రాళ్ళ వర్షం ఉద్ధృతమైతే
అద్దాలిళ్ళను హెచ్చరించాలి

శిలువలన్నిటిని కాల్చేయండి
పట్టణమౌతున్నదో వధ్యాస్థలి

మొరలకు న్యాయం దొరకనిచో
మొగలు దారిలో అరి చేయాలి

ఎన్ని దిష్టులో ఆమె ముఖానికి
ఇక ఎల్లరికీ ఇది తెలుపాలి

నమ్మి కూర్చున్నాము నిన్నే పర్వీన్
న్యాయ భిక్ష నీవే కద పెట్టాలి !

- అనీస్ పర్వీన్

నీ ఆకాశ సౌధాలలోనే నీవిక విహరించు
నాకీ పూరి గుడిసెలలోనే మహోహ్లాదమనిపించు

జీవిత మంతా నాది తుఫానులలో గడిచినా
ధైర్యమనే నా గుండె దివ్వె ఆరిపోలేదేనాడైనా

షాగిల్ ప్రేమను నేననవరతం పంచుతూనే ఉన్నాను
పేదలీ పట్నపు ప్రజలను నా వెనకే చూస్తున్నాను !

- షాగిల్ అదీబ్

చీకటి రాతిరిలో చేయిచ్చును నీడ కూడ
ఉదయమా నాతో ఉండు ఏడ్పించకు నీవు కూడ

కాలమూ నిదురోయింది నా కథ వింటూ వింటూ
ఎంతో కథ ఇంకా చెప్పాలి ఎవరినింక వినమంటూ ?

అసీర్ పెదవికి చేటంటూరు పేదవాని కోరికలు
వాడి కలలు మాత్రమవి ఆకాశ సౌధాలు

- ఇస్మాయిల్ ఖాన్ అసీర్

అలగడమామె కలవాటవగలదేమో మిత్రమా
ఆమె నంతగా బ్రతిమాలడం అసలే చేయబోకుమా

ఏ మాటొకటి నాచే అన్ని మాటలు మరిపించునో
ఏమని చెప్పను ప్రాణమా నిన్నే మరువాల్సిందయెనో

నా పరిస్థితి మీద నేనే నవ్వుకుంటాను నేడన్వర్
నాకిది పిచ్చిగ తోస్తే పిచ్చి ప్రపంచంపై నవ్వేను !

- షాఖ్ అన్వర్, ఆదిలాబాద్

ముచ్చట ప్రియసిది వచ్చినప్పుడల్లా
వింత గిలిగింతయే నా శరీరమందెల్లా

రంగు రంగుల స్వప్నాలే రాత్రి నిద్రయందెల్లా
రతీ మన్మథులమై మేము రేతస్సుఖులైనప్పుడల్లా

నూర్ మధురాతి మధురం కదా బ్రతుకెల్లా
చందమామ భామ దొరికినోడి కల్లా

- నూరొద్దీన్ అహ్మద్ నూర్, వరంగల్

మా కన్నులలో దీపాలే వెండి వెల్గులై నిలుచు
మా పాద ముద్రలపైనే జగమంతా నడుచు

బ్రతుకు పుస్తకంలో మండే పుటలన్నీను
కలాన్ని రక్తంలో ముంచి గిల్కినవే అంటాను

దావూద్ చూశావా ఎంత విచిత్రమీ దశకం
మన ఆలోచనల నీడలనూ మ్రింగేస్తున్నదమాంతం!

- దావూద్ అస్లాబీ, హన్మకొండ

ఇక్కడ నేనాగినాను అక్కడ కూడా ఆగాను
సంతసం జుర్రుకొనేందుకు చాలా చోట్ల ఆగాను

చెల్లికాలినా ఇల్లే కాలినా కూడా నేడు
అంతా నిర్దయులే అడుగ రాడు ఎవ్వడు

గజలులోన నా ప్రేమకు ఋజువివ్వాలనుంది
ఆమె అందాన్నషార్లలో బంధించేయాలనుంది

కొందరు మన నేతలు గుర్రు నిద్ర పోతున్నారు
ప్రజలనుసి కొల్పితే వారే వాళ్ళని చూసుకుంటారు

భూఖబ్జా దారులు భోజ్యం చేస్తున్నారు
విఖార్ కలం పదునుకు విలవిలలాడ్తున్నారు !

- విఖార్ రియాజ్, గుల్బర్గా

ప్రపంచమంతా నాతో ప్రయాణిస్తూనే ఉన్నా
నీ కురులూ ఆ బాహువులకే నేనెదిరి చూస్తున్నా

పూలే నాకెన్నెన్నో పుండ్లు తాము చేసినవి
ముళ్ళతోడ నా జీవితం ముడేసి పోయినవి

ఈవి తావి జీవితానికి కావాలంటావేం
నర్గిస్ లాంటి వారి కనుసైగలు కావాలి సలీం !

-సలీం ఆబిదీ, మహబూబ్‌నగర్

తమ వారిని ప్రేమించే తత్త్వమే లేదెందరికో
నాకితరులనూ ద్వేషించే నంగనాచితనం లేదనుకో

దీపమంటే పడిచచ్చే శలభంతో దీపమనెను
నీవూ ఓ శలభానివా నిక్షేపంగా కాలకుంటేను

బాధలు మరువడానికని వాడు పానశాలలో తిష్టవేయ
చూస్తే మధుశాల నిండుకుని చేత ఎవడికీ మధువే లేదయ

రాళ్ళిసురుతానితరులమైనని వీళ్ళూ వాళ్ళంటారు యూసఫ్
మేమేమో పూలవానగూడా వర్షించనేలేం శత్రువులపై ఉఫ్ !

- మొహమ్మద్ యూసుఫుద్దీన్ యూసుఫ్

ఇంకా ఎంతో ఎగరాల్సుంది ఈ పక్షిలోనూ ఊపిరుంది
భూమంతా పంచబడింది పో యిక ఆకాశమే మిగిలింది

శాంతి సౌఖ్యాలింకా ఉన్న సామ్రాజ్యం ఇంకెక్కడుంది
చివరి వఱకు వెళ్ళాక నేను చేసేది ఒకటుందని తెల్సింది

ఇంకొక కొత్త పరీక్షను ఎదుర్కోవాలని తెలిసింది
నోట్లో నాలుకలున్నోళ్ళను తలతీసేయడమే రేపటి విధి!

- రాజేష్ రెడ్డి

ఆయనతో మాటలవో పూల వర్షంలా తోచును
చంద్రోదయ మాయన చల్లని దర్శన మన్పించును

నవ్వుతాడు తానెపుడు నవ్విస్తుంటాడు నన్ను గూడాను
అందమైన సంభాషణ ఆయన చేశాడు నేడూను

హృదయం నేను పందెంలో అదే పనిగ ఓడేశాను
ఆయనతో ఓడడమే అదృష్టమని అనుకున్నాను

ఆయన గూర్చే ఆలోచన ఆయనే నా ప్రాణమాయెను
మనసుకికేదీ నచ్చదు నా మహదానందమే ఆయనాయెను

దీపం ప్రస్తావనలో పర్వీన్ దీనంగా మనసు కదిలెను
కన్నుల నుండి అశ్రువులు ఘన మేఘాల్లా కురిసెను !

- డా॥ షమ్మా పర్వీన్

అయ్యో నేనిదెపుడూ ఆలోచించనే లేదేమని
ఎంత దగ్గరైతే మనమంత దూరమౌతామని !

విన్నావినకున్నా గాని నేను నీకు
విప్పి నా మనస్సును నీ ముందుంచాలి

ఇది నా గుండె అయినా నాకెంతో గర్వం
ఇందులో సొంతం నీవే ఉన్నావన్న నిజం

నేనేంటో నా ప్రేమేంటో తెలియాలంటే
నిన్నైనా నీవోసారి ప్రేమించి చూసుకోవాలి

ఎంతగ ఏం పాపం ఎప్పుడు నేను చేశానని
ఇంతగ నన్ను దూరం నీవు చేశావెందుకని?

ఎంత నీవు నన్ను ఏహ్యంగా చూసినా
ఈనాటికీ నిన్నే నేను యేమ్మా ప్రేమిస్తున్నా

షాద్ మీరు అతనిపై కాస్త భరోసా ఉంచండి
ఎవరికైతే అందరి గూర్చి తెలిసుంటుందండి !

- అంబాజీ రావ్ షాద్

ప్రేమ అదో పెద్ద చమత్కార మండి
అందగత్తెల కందుకనేమో గర్వమండి

ప్రకాశవంతమైన పట్నాల్లో గూడాను
చిక్కటి చీకటి చిరునామా లగ్గుపించును

మానవత్వమనే బాధను గుండెలో పెంచినాను
చీకటి బ్రతుకులలో వెలుగే వెలుగు నింపినాను

కవితలు నావన్నీ కాంతా సమ్మితమ్ములే
కలిసేందుకు తనతో రోజూ గతి ఈ కవితలే

కవినైనందుననే నాకు గౌరవమెంతో దొరికింది
కావున ఊహాలన్నిటికి కవితా రూపమిస్తున్నది

ఇంతగ ఈ నా గుండె ఏలని కొట్టుకొనుచున్నది
ఎవరబ్బా అంతటి అందగత్తె నావద్ద కొస్తున్నది !

- తాజ్ ముజ్జర్, వరంగల్

ఎంతో ముద్దుగనైనా పెంచింది
ఏనాడో ఈ ప్రాణం పోనే పోతుంది

వసంత ఋతువు వచ్చేస్తున్నది
బాగానే ఉన్నా అదో ఊహలాగుంది

కేశములల్లలాడి ముడివిడినది
మేఘాలే అవియై కురిసేలాగుంది

ఎవడి వద్దనని నే చేయి చాపాల్సింది
అందరిదీ చూడబోతే అదే పరిస్థితుంది

చషకాలన్నీ నిండే వున్నవదేంది
నాదొకటే ఇలా ఖాళీగా ఉందేంది

ఆశల పూలు విరిసేదే ఆ కొమ్మ
అదే నేను నేడు నరికేసింది

గుండె దీపం ముట్టించాల్సింది
సభలో దీపం అల్లలాడుతోంది

అందరి కన్నూ నీ పైనే ఫారుఖ్
అంతగ గౌరవం నీకే కదా ఉంది !

\- ఫారూఖ్ ఆరిఫీ

పతంగీ దారం సుమా మనసునలా లాగకు
భోగ్యాల్నీ అవయవాలు వాటినలా చూపకు

అడుగడుగున నా కోర్కెల గడుసుతనాన్నేమనను
బడుగు గుండె ప్రేమికుణ్ణి బాధితునిలా మార్చకు

రెండు గుండెల కలయిక మెండు కష్టమే అయినా
అనుమానం భ్రమలను నీ అక్కపక్కలా రానీయకు

బాధలతో మరీ మరీ బ్రద్దలైన మనసులను
కవితలతో జోడించగ కావ్యంలా మరువకు

కవిగారిని గుర్రుపెట్టి గట్టి నిద్ర పోనీయుము
కలలోనైనా జీవించును నసీమా కామునిలా చివరకు!

- నసీమా తురా బ్బుల్లాసన్

ఆర్తి లేనిదా ఆ నీ గుండె
అయితే అది ఒక బండే

ఎంత మారినది ఈ సంస్కృతి
ఏది విన్నా అదో పచ్చి బూతే

కరుణా ప్రేమలు లేనేలేని
గడ్డు కాలం తెలుసా మనదిదని

ఆమెలో యిక మార్పు రాదని
నీమాలేర్చుకున్నావివని

కనుచూపుల మాటలను
విని ఆర్జూ చెప్పు నీ జవాబును

- అబ్దుల్ రహీం ఆర్జూ, గుల్బార్గా

నీ ప్రశ్నలవెన్నైనా దీటుగా
నే జవాబు లీయ నేర్తునుగా

చీకటులెంత మిన్నగ చేసినా నీవు
అంతగ సూర్య కాంతులందిస్తానేం చేస్తావు

అల్లిన నా కవితల నామెదిండు క్రింద నేను
గజలుల దివానుగా కౌసర్ అమర్చినాను !

- మహబ్ కౌసర్, గుల్బర్గా

జీవితాన్ని ఇపుడిటులే సాగించాలండి
చేదు విషం తాగుతూ నవ్వుతూ ఉండాలండి

చాకు చేతులలో చురకత్తుల మిత్రులతో
ఇక్కడ ప్రతి రోజూ గలామిలాయించాలండి

ప్రవహించే నదిని మీరు దాటాలనుకుంటారా
అలలూ తుఫానుల నధిగమించవలెనండి

హద్దులేనివే కదా కోరికలవెన్ని తీరినా
వద్దు వద్దు కోరొద్దని లెంప లేసుకోండి

నుదుట వ్రాతలే నూత్న సహస్రాబ్ధి గ్రంధాలు
చదువ. గలిగితే అవి శాస్త్రోక్తంగా చదవండి

మలిగి పోవు దీపాలను మరి మరి ముట్టించే బదులు
మీరే ఓ దీపమయి జోరు మీద వెలగండి

మూసుకోండి మీ నోరు మీరెందుకు వాగుతారు
చుట్టు జనాల పలుకులనే అజీజ్ గుట్టలుగా వినండి !

- మొహమ్మద్ అబ్దులజీజ్ అజీజ్

నిశ్శబ్దంగా వింటుంటావు
నీవు ఎందుకు మాట్లాడవు

మన మనుకునే వేవీ కావు
ఐనవి మనమనుకున్నవి కావు

మనసుల నతికించాలి అంజుమ్
వాటిని విరగ్గొట్టుట జులుమ్

- హీఫీజ్ అంజుమ్

జీవితమో నిండిన మధు కలశం
గడచిన క్షణాల శోక గీతిలా

ఒలుకుతూ ఒదుగుతూ గడుస్తుంది
జీవితమో ఎడతెగని ఆశల కెరటం

సుఖ దుఃఖాల ఒడి అనే పడవలా
పైకీ క్రిందికూగుతూ మంద్రంగా నడుస్తుంది

జీవితమో సకలబలుని అనుగ్రహం చింతా చీకాకులది
చివరకు అనుభవాల సారంలా అది ముగుస్తుంది !

- మహోష్ బానూ అహ్మద్ (పాకిస్తాను)
వురిసిలా డా॥ బానూతాహ్రా సయీద్

ఆలోచనల శృంఖలలాగవు మేధవున్నంతవరకు
ప్రశ్నల వర్షం ఆగదు పెదవులు పదిలమైనంత వరకు

నీ తర్కాన్నెపుడూ ఆగకుండా వ్రాయడం మానకు
గీతాలు గేయాలు గజళ్ళు ఖ్యాతి తెచ్చును నీకు !

- డా॥ వహీద్ అఖ్తర్

నా కవిత్వమే నా జీవితం మిత్రమా
నా శరీరం ఆత్మా అన్నీ అదే తెలియుమా

నా ప్రక్కన ఎవరున్నారని నాకీ ఆనందం
నా చుట్టూ ఎవరూ లేంది నిజంగా నిజం

కోపంలో మమ్ములను కొట్టి నాంక మా అమ్మ
ప్రక్కకెళ్ళి బోరుమని గుక్క పెట్టియేడ్చేదమ్మ

నీకిచ్చేందుకు నావద్దున్నదిదే ఓ బికారీ
నేను మెచ్చిన నాకు నచ్చిన నాదివానె షాయరీ

కవితలవేవీ నా కలం వ్రాసినవి కావు ఇస్మత్
ఆకాశంలోని చుక్కలను త్రెంచి అందిస్తున్నా హజ్రత్

- ఇస్మల్ ముజఫ్ఫరీ, వరంగల్

నిప్పుల్లో నడుస్తూనే పెదాలపై చిర్నవ్వులు చిందిస్తున్నా
భారతీయుల మానవీయత భవ్య చరిత నెరింగిస్తున్నా

పథ్యం చేయుటలో ప్రసిద్ధులం కాదా యేం మనము
సత్యం మాట్లాడకుండడమేనా మన గొప్ప (నే) పథ్యం

వెన్నెలలా చల్లదనం విరబూసే సూర్యునికై
వేచి చూస్తున్నా నెన్నటి నుండో నేనాదినానికై

జగమెందుకు ఈ రీతిగ మొహం తెల్లవేసింది
మొగుడు లేని దాని తీరుగ తెలుపే తెలుపయ్యింది

తలలెత్తుకుని నడిచేవారు ఇలలో యే కొందరో
సలాములు చేసే గులాములే మిగిలిన వారెందరో

ఎవడి పతంగో యేమో కదా ఈ ప్రపంచం
ఎవడెగరేస్తున్నాడో దీన్ని ఎవ్వరమూ ఎరుగం

నేనైతే కొన్నాళ్ళకు నిధనుణ్ణౌతా అస్మత్
వేనవేల యేండ్లు ఆరోగ్యంగా వర్ధిల్లాలీ భారత్ !

- ఇస్మత్ ముజప్ఫరీ, వరంగల్

చెట్టును నీవు కొట్టేస్తున్నా
గాలి నిచ్చె దాని ఆకులే నీకన్నా

ఆ చెట్టు మీద నీ పేరే ఉన్నా
దాన్నే నీవు నరికేస్తావేమన్నా

ఎక్కడ ఉన్నాన్నేనని చెప్పను
నిజా నిజాల మధ్యన ఉన్నా

నేం బోర్డు నేనేమని పెట్టను
ఒక్క గదింట్లో ఒదిగి నేనున్నా

అనుభవాల సారాలు అసర్ కవితలు
అవి విని అంతా తలలూపిరన్నా !

- అసర్ గౌరీ

మనీషిని అనుభవాలు కొన్ని మనిషిగా మారుస్తాయి
త్రాగక తూగే వాడినేవి తడబడకుండా చేస్తాయి

నీ అందం వర్ణిస్తూ నేనోని కార్తైన గజలు వ్రాస్తే
ఏం చేయను ఓర్వలేక ఇక నాతోటి కవులే ఏడిస్తే

కాలానికి సమయంలో గౌరవమెవ్వడీయడు
కాలం గడిచి పోయాక సర్వర్ ఎందులకీ ఏడ్చుడు!

- సర్వర్ హాష్మి

బేడీలు తుపాకీ రాజ్యాలు. బేటా అవి రోజుల భోజ్యాలు
ఇలపై స్వర్గం కాశ్మీరు సమస్యలిలా తీరునన్నవబద్ధాలు

పిడికెడు మంది ఆపిళ్ళవంటి ప్రజలపైనా
పిచ్చి పాకిస్తానీ ఆగంతక విద్రోహుల ఆగడాలు

అభం శుభం ఎరగని వారిపై అప్రకటితమైన ఈ యుద్ధాలు
లోయలలో సందరీమణులపై అత్యాచారాలు

ఎందులకీ అమాయకులపై ఈ రీతిగ దౌర్జన్యాలు
ఏమిటీ వీరు చేసిన పాపం ఎందులకీ పరీక్షలు

అమాయక హతులు నుండి చిందే ఈ రక్తం
అందచందాల లోయలకే పెద్ద కళంకం

అఘాయిత్యాలకు బలయే అన్నా చెల్లెళ్ళ కభివందనం
అన్ని కాలల్లోనూ జుల్ములు అవసరమా నేస్తం

మరియా ఏసుక్రీస్తులు బలి అయ్యారు ప్రజల కోసం
మరీ ప్రజలనేల కారణం లేకుండా ఇలా బలి చేయడం

నా ప్రార్థన ఇదిగో నమ్మండీ కాశ్మీరీ మిత్రులు
దొంగలు చోరబాటుదారులు దుష్టులు దుర్మార్గులు

ద్రోహులు దుష్టశక్తులు దొరుకకపోరు త్వరలో
లోయల పూర్వ వైభవం సాధిస్తామచిర కాలంలో

మళ్ళీ చిగురిస్తుంది కాశ్మీరం మరీ దగ్గరుంది గమ్యం
చారిత్రిక ఆ సుదినం వచ్చేస్తుంది తాప్రా సత్వరం !

- బానూ తాప్రా సయీద్

ఎందుకు తీర్చి దిద్దావీ విశ్వాంతరాళాన్ని
ఇది ఏనాడో చూడాల్సిందే కదా ప్రళయాన్ని

స్నేహితులంతా కష్టాల్లో చిత్రంగా వీడి వెళ్ళినారు
శత్రువులే ఆ ఊబి నుండి లాగి బైట వేసినారు

ఆమె వెంట వున్నప్పుడు అన్నీ మరి వెలుగులే
అహో ఇపుడు చుట్టురా అదేగా చీకటులే

అదేమో ఎన్ని బాధల్లో నేను మునిగున్నా
అల్లా అని పిలువగనే అన్నిటినీ చేసి సున్నా!

- యూసఫ్ యక్తా

తరఫ్దారీ చేస్తే జనులు తెగ మెచ్చుకుంటారు
న్యాయం మాట్లాడితిరా నానా తిట్లు తింటారు

అవసరాలు తీరిస్తేనే ఆహా మా దేవుడంటారు
అవి తీరని నాడో ఆయనను తలవనే తలవరు

కాలుష్యాలతో కాళ్ళూ చేతులూ పడిపోతున్నవి
పర్వాజ్ ఐనా పట్టణాల్లోనే ఇంకా పల్లెలన్నీ కలుస్తున్నవి !

- అలీం పర్వాజ్, కరీంనగర్

నిశ్శబ్దపు చూపుల భాష నీ కసలు రానే రాదోయి
అశ్రువులు నా కళ్ళ యందదేగా మాటాడునోయి

నా యింట్లోనే ఉంటుందైనా అహో తానేకాకి
ఎవరో కాదు సుమా నా ఇంటిదే తానో మాల కాకి

తళుకు బెళుకు అద్దాల పనిచేసే ఆ ప్రక్కననే
తాను సాదిఖ్ అందాలోలుకు గజళ్ళు విన్పించునే !

- డా॥ సాదిఖ్ నఖ్వీ

అద్దాల సామ్రాజ్యంలో అద్దమంటి చక్రవర్తిని
అదేమో అద్దాల దుకాణంలో నిత్య స్ఫూర్తి నా పని

గాలి వాటం చెప్తోంది తొందరగానే వస్తుందని
రాళ్ళ సీమలో రత్నాలను ఏరుకునే ఓ నాడని

కుర్చీ మొలలు గ్రుచ్చుకొనే కొండంత వీలున్నది
కూర్చుని అందులో షైదాయీ కైత రాయవీల్లేకున్నది!

- ఇక్బాల్ షైదాయి

అందరూ దాసోహం అందురామె హోయలుకు
కొందరు గుండెలో తుల్లుండి ఇంకొందరు తమాషాకు

పండించాలండీ అన్ని పంటలూ ప్రేమలవే
తడి తడి భూమిలో వడిగా పండే పంటలవే

అందరి చర్చలు ఆమె గుఱించే యేమా అందం
ఆమె దృష్టి మాత్రం గోహర్ వేపే ఏమదృష్టం !

- గోహర్ కరీంనగరీ

జీవితమా నీతో గడపడం చేదు అనుభవమంటాను
నీవు నాకో సమస్యగా మారకుండా చూడమంటాను

గమ్యం చేరకుండా నన్నాపగల వాడే లేడండి
గమ్యపు దారే తాను నా కాళ్ల వద్ద ఉందండి

అందరికీ అర్థమయేంత సరళంగా కవితలు వ్రాశాను
జమీలుకు నీకూ మధ్య బంధాలన్నిటినందు చేర్చాను !

- జమీల్ నిజామాబాదీ

ఈ యేడూ వర్షా భావంతో నా పొలాలెండిపోయె
ఇంతగ ఉన్న నా ఈ బాధల కన్నీరు పారిస్తే పోయె

ప్రపంచం మొత్తం మీద మంచి ప్రదేశమిదేనా ఒకటి
గాయాలన్నీ వచ్చి గుండెలోనే నిలిచెనేం గూడు కట్టి

అక్షరాని కొక నెత్తురు చుక్క నాదర్ నేనర్పించాను
అచ్చమైన ఇలాంటి గజలొక్కటి నే వ్రాయగలిగాను!

- నాదర్ అస్లాబీ, హన్మకొండ

ముంగురులవి నీవి మోహాలొలికిస్తున్నవి
దినమో అందం రాత్రి మరో అందంలా తోస్తున్నవి

క్షణాక్షణమూ నీ జ్ఞాపకాల దివ్వెలెలిగిపోతున్నవి
నీ పరిష్వంగం లేక మళ్ళీ చీకట్లౌతున్నట్లున్నవి

ఎందరెందరి కళ్ళుని నీ సౌందర్యం పై నున్నవి
దిష్టులకే దిష్టి తగిలేవిలే నీ దృక్కులవి

పిడుగు పడేసేట్టుందామె చూపు ప్రేమికులూ భద్రం
ఎవడి మీద పడునో ఎవడిదో ఆ అదృష్టం

నేనొస్తున్నానను వార్త చదివి రాహీ ఆమంది నిజం
ఈ రోజు వార్తల్లల్లోకెల్లా ఇదే పచ్చి అబద్ధం

- డా॥ రాహీ

చుక్కనీరు చూసినా చూచినా సంద్రమునే
నీకావలిసింది మాత్రం ఆశించుమో కూజా నీటినే

మనసుకు నెమ్మది మెదడుకు చల్లదనం నిచ్చు
దృశ్యమే ఎప్పుడూ నీకు దృష్టికావాలనే సుమా తలచు

చిన్న పిల్లల నాహ్లాదుల చేసే వాడెవడైనను
ఇంద్ర జాలికుని వలనే నాకెపుడూ తోచును

నిప్పుమంటూ నింగినంటు జ్వాలైనా ఈ స్వభావం
చెలిమికి ప్రతీకగా చిందనీ నవ్వులు నీ మొహం

అల్లా మన కిచ్చినదే అదృష్టం కాదా మనకది
ఆంతర్యాన్ని మించనట్టి అదృష్టమింకేమిటుదున్నది

అస్పష్టాలే అన్ని ముఖాలు అస్పష్టాలే దృశ్యాలన్నీ
జీవితాలనే అద్దాలన్నీ తెలిసె అస్పష్టాలేననిన్నీ

పట్టణాన దిట్ట గజలు వ్రాసే మొనగాడే షఫీఖ్
తుట్ట తుదకు కవి సమ్రాట్టనదగిన మేటి రఫీఖ్ !

షఫీఖ్ ఇక్బాల్

కనులందామె గూడు కట్టుకొన్న నాటి నుండి
గుండె యేలనో యేమో కొంత లయ తప్పిందండి

హృదయ మెప్పుడూ చింతాక్రాంత యేనాయె
ఒక చింత తీరగనే వేరొకటందు చేరిపోయే

ఏ చింతా లేదన్నదే ఇపుడు చింతయైపోయె
అన్ని చింతలూ నాకు ఆర్తినిచ్చి వెళ్ళిపోయె

గుండె పరిస్థితి నే వివరిస్తూనే కదా ఉంటిని
గుట్టుగ తానేమో చిరునవ్వులు చిందించెడిని

అదేమో ఏకాంత మదిలో ఆమె ఆలోచన
గుండెలో ముల్లై గుచ్చుకొన్న నేనేమన

ముఖాలను చూసి మీరు మోస పోవద్దు సుమా
అమాయక అందగత్తెలు ఔతారురిత్రాళ్ళు సుమా

పాడుబడిన మహలను కున్న ఈ గుండెలో షఫీఖ్
గూడుకట్టుకొన్న దొక్క భామ యేమి నా నసీబ్ !

- షఫీఖ్ ఇక్బాల్

గుండె తలుపులు తెరిచే ఉన్నవండి
రండి కూర్చుని దయతో మీ పేరు చెప్పండి

పువ్వులతో ఆడిఆడి పుట్టిన దండీ విసుగు
ముళ్ళతోడ కొన్ని నాళ్ళు మోహమింక మెరుగు

మన వాళ్ళెపుడు మన వాళ్ళే ఎప్పుడూ ప్రేమిస్తాం
బయటోళ్ళను కూడా అలాగే ప్రేమిస్తేనే ధన్యం

ఎంత చెప్పినా వినదదేం వెర్రి నా హృదయం
సుంత మీరైనా యత్నించి నేర్పండి ప్రేమించడం

గుండె నగరు కెల్లప్పుడూ ఓ ప్రేయసీ
అందనిది కావాలే నీవు కాకే రాక్షసి

మూడు నాళ్ళ ముచ్చటలే బహార్ వసంతం
పువ్వుల కెందులకీ పోజులు ఇంత కాస్త కోసం !

- మనోహల్ లాల్ బహార్

గుండెనిండా నిత్యావసరాలే నిండివున్నవిపుడు
అల్లాకే గాని ఆమెకైనా గాని జాగాయేదింకిపుడు

ఏకాంతపు దారులు ఈ మండుటెండలందు
నీ జ్ఞాపకాల నీడలే నా తోడు పధికులందు

ఎవరికిడే మొరలింక ఏవీ లేవు యికపై నాకిపుడు
నాతో నేనే ఎంతగనో నాసిర్ వేసారినాను చూడు !

- నాసిర్ కర్నూలీ

నా కన్నుల కాంతివి నీవై
నన్ను మళ్ళీ చేరు జీవితానివై

నీ వెల్గులలో తరించునీ జగము
నీవు మనీషిగా ప్రవర్తించుము

చూడుమేదో నాడు కిరన్ నీవు
వెన్నెలై చంద్రునిలా వెలిగి పోతావు !

- కవితా కిరన్

అగ్నికి ఊరంతా ఆహుతైన తరుణాన
అడివి దారి పట్టినాము ఏం తోచక ఆ క్షణాన

స్నేహ బంధం తెంచేసుకు ఆహా ఎంతో కోల్పోయాం
యేనాడో నీకు ఇది తెల్సినా అపుడేముండును లాభం

అన్ని మన దేశ భాషలూ అవి గొప్పవే కాదనను
అన్నిటికన్నా గొప్ప భాష ప్రేమదని ఎలా చెప్పను

భూమాత ఋణం తీర్చుకోగలమా ఏం మనం
ఆకాశం మనకిస్తున్నంత సేపూ ఆశీర్వాదం

భిన్నమైన మతాల పూల మిన్న చెండు ఈ దేశం
ఇది గుబాళిస్తూనే ఉండు సుగంధాలు నిత్యం

దేశ పరిస్థితుల నెరుంగుదువా నీవు నష్తర్
లేశమాలోచించు ఇదెటుళ్తుందో ఓ సర్దార్ !

\- నానక్ సింగ్ నష్తర్

చివరి ఉర్దూ - తెలుగు నాదం

# TRANSLATIONS OF HINDI POETS

ఈ భాషా ఈ కాలం ఈ దేశాల్నావనెలా చెప్పను
నా అనుమతివినా బందీని వీటికి నేను

గర్భస్థ శిశువుకీ దేశంలో గర్భమే సురక్షితం
పుట్టి ఆకలికి కేకలేసినపుడు
పొలాల లోనికి పంపే బదులు ఫుట్‌పాత్‌ల
పైకే కదా పంపుడు

కాలం చేతులలో దేవతలకైనా రూపులు
మారడం సహజం
కాల ప్రవాహంలో అంతా మునిగినా అదీ ఓనాడు
సంద్రంలో కలవడం తథ్యం

- గుంటూరు శేషేంద్ర శర్మ

నీ గానాన్నై నేనెంతగనో నిజంగా గర్వపడుతున్నాను
నీ ఊపిరిలో వేడిమిని నేనై క్షణం క్షణం కరగనున్నాను

కవీ నీవాకసమైతే నీ కల్పనను నన్ను ప్రేమించుకో
బాహువులలో బంధించి ఈ ధరిత్రి నాకాశం చేసుకో

ఉదయ కాంతులు చూడాలా చీకటి రాత్రులు తప్పవు
జీవన సంధ్యే లేకుండా యే జీవిత వెలుగులూ భాసించవు

- డా॥ ఇందు వసిష్ఠ

దేశంలో ఏ పట్టణానికెళ్ళి చూసి వచ్చినా మనకి
దీటనిపించదదే మాత్రం మన హైదరాబాదు నగరానికి

ప్రేమకు పునాదైన చార్మినార్ నగరానికి గుండెలాంటిది
యేమైనా అది జనులందరి గుండెలదరికి చేర్చునది

ఖులీ ఖుతుబుషా భాగ్మతిల ప్రేమ ఇంకా ఇచట
భలేగా అందరి హృదుల్లో వృద్ధి పొందుతున్నదన్నమాట

అందుకేనేమో ఈ నగరంలో చదువ్రా సంధ్య కవితలు
అవేగాక ఆదరింపబడుతున్నవి మానవతా విలువలు

నగరంలో మందిరాలు మస్జిద్లు కూడా ప్రక్క ప్రక్కన
నగర ప్రజలేమో ఉంటారు భాయీ భాయీల లెక్కన

ఉర్దూ హిందీ తెలుగు మరాఠీ కన్నడ మొదలగు భాషలు
ఎంతో కలగలుపుగా ప్రజలు ఆదరించే అక్షర వాక్కులు

ఈసా మూసీల సంగమం హిందూ ముస్లింల ఐక్యత
ఎంతగానో ఎదుగుతున్నది వర్మా ఈ నగరంలో సఖ్యత

- నెహపాల్ సింగ్ వర్మ

కనుల యెదుటి ఘోరాలను కవితలుగా విన్పించిన
కాలి బూడిదయేనిక నా పెదిమలదాటున

ప్రమాదాలు తప్పించుకు బైట పడితేనే మనము
బ్రదుకు జీవుడా అని వాపసింటి కొచ్చేస్తాము

శవం గుర్తుపట్టే వీలౌతుందని ఓ ఫోటో మేము
జేబులో పెట్టుకు ప్రతి రోజూ బయల్దేరుతాము

అసత్యమే సత్యమై చలామణి అయ్యేనీనాడు
అపుడంతా సత్య హరిశ్చంద్రులౌదురు చూడు

నిన్నటి వరకూ కుటుంబ పెద్దంటే అందరికీ గౌరవం
రిటైరైన నాటి నుండి అతడందరికీ బరువిదేం ఘోరం

అబద్ధాలెన్నాడినా ఆతడన్నిటినీ సత్యాలని ఒప్పిస్తాడు
అదేమిటంటారా భగవద్గీతపై కదా ప్రమాణం చేశాడు

ఇసుక రేణువంటే ఏహ్యాపడిన ఆ ఆకాశతార
ఇదిగో తెగి భూమిపై పడి దాన్నే కావులించుకొందిర

- బల్‌బీర్ సింగ్

కడుపు నిండని వానిమీద కంటకాల్లో నడిచే వాని మీద
కలం నీది వ్రాయాలే కాని కా గూడదింకా దేనిమీద

ఆకాశం కప్పు క్రిందపడుకునే ఆశలు తీరకనే కాలం దొర్లే
ఆశాజీవుల నిరాశా బ్రదుకులపైనే నా కవితలు దొర్లే

చిరిగిన బట్టలకూ నోచుకోని-శ్రమే శ్రమైనా అలసటే లేని
అభాగ్యులపై అవిశ్రాంతంగా కవిత వ్రాయడమే నా పని!

- సూర్యదేవ్ పాఠక్ పరాగ్

నా ప్రేయసిని చూపిస్తాను మీరంతా నాతో రండి
నా ఈ గజలే నాకు నా ప్రేయసి విని చూడండి

అందరి మిత్రుల కన్నులన్ని అశ్రుసిక్తాలైనవి
నా బాధల గాధల నింకా నమ్మి ఏడ్చే కన్నుల్లేవు

సాజ్ రావోయీ నీ సంగీత వాయిద్యాలు తీసుకు
సదా ప్రేమ గీతాలనే వినిపిద్దాం ఈ లోకులకు

సంద్రమంత మధువైనా చాలని ఈ సాజ్‌కు
చుక్కలు నాలుగు ఈ మధువుని ఎక్కడేమూలకు !

- సాజ్ జబల్పూరి

నిజాన్నే పలికే నాల్కను నేడూ తెగ్గోస్తున్నారు
నిజాన్ని మాత్రం వినే చెవులలో ఇంకా సీసం పోస్తున్నారు

సత్యాన్నే అన్వేషించే కన్నులను సొంతం పొడి చేస్తున్నారు
సత్యాన్నే తలచే వారిని సదా ప్రహ్లాదుల చేస్తున్నారు

అంతటి ఎత్తుల నుండి అగాధాల్లోకి తోసేస్తున్నారు
అయినా ప్రహ్లాదులు క్షేమంగా తిరిగి వస్తూనే వున్నారు

రాడా ఈ అవినీతి వ్యవస్థా హిరణ్య కశ్యపుణ్ణి చెండాడు
మొనగాడు స్తంభం చీల్చుకుని మన్నై మరో నరసింహుడు

- అజిత్ గుప్త

స్నేహం చేసే యోగ్యుడైన చెలికాడొక్కడు దొరకలేదు
గుండెలు కుట్టేదామంటే రెండోదొక్కటి కనరాలేదు

ఉరుకులుపరుగుల జీవితానికి ఒకరిద్దరా యేం భాగస్వాములు
కూడూ గూడూ గుడ్డలకై శతకోట్ల జనాల ఈ పరుగులు

చచ్చినాంక మిత్రునింటికి వచ్చి పరామర్శించడంలేదు
పరుగిడిపోతున్న కాలం వెంట పరుగులిడే తీరికలేదు

ఎవడి ముఖపు పరదాలో వాడే పో అందగాడు
ఎవడి స్వార్థపు సంకెలలో వాడే బందీయై ఉన్నాడు

అజరామరమని కీర్తిని అంతగా అందరూ అందురు
అదేమో రెండు రోజులకే అంతా మరుస్తారు అందరు

మరీ మరీ జీవితాలు స్మితా మనకు దొరకని అందాలు
సుంత కొనగలమా మనం ఎంత పిరం సంతసాలు

- శ్రీమతి స్మితా పాటిల్

వజ వజ మని వణుకుతావెందుకు
మండుటెండలోనూ మజాగా బ్రదుకు

దాహమేసేనా ఈ మురికి నీరెందుకు
శీతల పానీయాలనే త్రాగవదెందుకు

ట్రాన్స్‌ఫార్మరది పేలినదా ఇక
తమస్సు గతి నీకింక వెరువకు

సుఖాలే సుఖాలు కదా నీకు
దుఃఖాల్నెందుకని దూషించమాకు

వచ్చేస్తున్నాయదిగో ఎన్నికలిక
దుఃఖపు గుంతలు మూయిస్తానిక

నీ ఈ గుడిసెలోన నేనిక
ఏ.సీ మెషినే యేయింతు నాకో !

సూర్య కుమార్ పాండేయ్

పక్కింటావిడను చూస్తే పళ్ళు కొరుకు నా శ్రీమతి
సవతిని చూచినంతగా ఇంకా చలికొణికే ఆ రీతి.

ప్రాణేశ్వరని తెచ్చుకున్నది పశ్చాత్తాపం కల్గిస్తున్నది
ఇంతటి చెత్తకుండి అహోనన్నే ఏల కొనుక్కున్నది

హమ్ ఆప్‌కే హైం కౌన్ ను ఆనాడెన్నడో చూచినాడు
హావ భావాలా సద్దన్‌వి అసలే మరువలేకున్నాడు

అదేంటి ఆడాళ్ళులా మగాళ్ళ ఆ బాబ్ జుత్తులు
ఏవగింపు కలిగించే ఈ నడమంత్రపు ఫ్యాషన్లు

పాపాల ప్రక్షాళననే నా పనిగా రహీమ్ పెట్టాడు
భయమేస్తున్నదెక్కడైనా బర్తనొకటి కన్పడినప్పుడు!

- రవూఫ్ రహీమ్

మొన్నటి పుట్టు బీద నేడు మహానాయకుడైనాడు
రాముడని అందరనుకున్నవాడు రావణుడైపోయినాడు

అబద్ధాల అద్దాల మేడల్లో అంతటా నోట్ల పడకలు
నిజ ధనుల నివాసాలలో నేడు రేపటికే సామగ్రులు

నిన్న ఫుట్‌పాత్‌పై చచ్చినోడు మహా నిజాయితీ పరుడు
అడుక్కు తినే వాడే భరతమాత పద్మ భూషణుడు

అన్ని మన అసూయాద్వేషాలకు అంతగ మనస్సే కారణం
విడిపోయిన నా వంతుకు మిగిలిందే వీధి ఆంగణం

ఒళ్ళో తన వద్ద నాకై కొన్ని ముళ్ళు కూడా శూన్యం
ఓహో ఆ ప్రేమనందనం పాడువడిన పూల వనం !

ఉమాశ్రీ, హోషింగాబాద్

మనసులోని చీకట్లను మలిపే మణి దీపాలెలిగించండి
అన్ని కలుషితాల్ని బూది చేసే రాగాలాలాపించండి

జగమంతా స్వర్గమయే చమత్కారమొకటేదో చేయండి
పాపం హింసలను పని కట్టుకు భస్మం చేయండి

ప్రేమ దయ మానవతల పాఠాలను మాత్రం నేర్పించండి
సుఖ శాంతులు జగతిలోనింపే చోద్యమొకటి చేయండి

మానవతా జ్యోతిని మహితంగా ప్రజ్వలింప చేయండి
దానవతవి అడుగు జాడలు ధరలో లేకుండా చూడండి

ప్రీతి ప్రేమలను పంచుకుందాం పరస్పరము రారండి
అలౌకిక ఆనందాల నిచ్చే అనంత జ్యోతులెలిగిద్దామండి

గొప్ప గొప్ప గేయాలను ఇప్పుడు నేనిక వ్రాస్తాను
వాటిలోన ప్రేమ కరుణ కూరి కూరి నింపుతాను

దిన రాత్రాలు జగాన జనులు పాడుకునే రాగాలుగ
దిక్కు దశ లేనన్నిగ రాస్తా అక్షయ దేశ భక్తి గీతాలుగ!

- గోవింద్ అక్షయ్

నిన్నటి సంస్కృతీ సంపదల స్పృహ చిహ్నాన్ని నేడు నేను
గడచిన తీపి జ్ఞాపకాల విడిపోని అడుగుల జాడను

ఊపిరి పీల్చడం కూడా ఓ ఈశ్వరాజ్ఞయేనని
ఓరుస్తున్నానీ జీవితాన ఉద్భుత బాధలెన్నైన

చిరునవ్వే నేను చిందిస్తున్నా ఎల్లప్పుడు
అదే నా గుండె గాయాల ఆర్తిని చల్లార్చేడు

తన చిరునామా తనకే తెలియని
ఘన గమ్యానికి నేనో రహదారిని

ఎవరబ్బా నాపై ఇంతటి రాయిని విసిరేసి పోయింది
ఎందుకు ఇంకా సందేహం వాడు నావాడే అయుంటుంది

నిన్న నన్ను దోచినది నిక్కముగా చీకట్లైతే
వెల్గులే దోచె సహర్ చేసేదేమి మరి ఈ రోజైతే

- జగ్జీవన్ లాల్ ఆస్థానా సహర్

కాసిని చీకట్లను కూడా నీతో కలసి నడవనిమ్ము
వెలుగులు చేయిచ్చినపుడవే నీకు దారి చూపు సుమ్మ

మన దేశమెపుడో ఏనాడో స్వదేశీగా ఉండేదేమో
కాని నేడిది చూశారా ఉపదేశాల దేశంగా మారిందదేమో

తీరంలో కూర్చున్నప్పుడు సాగరం భయభ్రాంతుణ్ణిచేసెను
అదే ఓడ ఎక్కగానే అంతటిసంద్రం ఇంతేనా అనిపించెను !

- తుల్జా ప్రసాద్ విమల్

కర్రతోనే భవనం కట్టాడేంటి మంత్రి చెద పురుగులుతినేసేయవా
వాడే ఓ పెద్ద చెద పురుగు వాడుండగా చిన్నవి రాగలవా ?

కొత్తగ కంప్యూటరైజ్డ్ చేయబడ్డవి కొనండీ మా కిరోసిన్ పొయ్యిలు
అత్తలొంట చేస్తున్నప్పుడే పేల్తవి కోడళ్ళ జోలికి పోనేపోవసలు

మా కోడలెంతో మంచిది నేనెంత తిట్టినా పలుకదు బదులు
పిచ్చి కుక్క భౌ అంటే పోకు జోలికి అమ్మ చెప్పిందనె కోడలు!

- దుర్గా దత్ పాండేయ్

రజనీ గంధా చందమామ రాతిరంతా విరగబూయ
ఆ సుగంధం చల్లదనము అలదె మమ్ముల చందనమ్మయి

నా బాధలితరుల వాటి ముందు నాకాట బొమ్మల్లా తోచె
ఆపై వాటితో పిల్లనిలా ఆడుకొనుటే నాకు బాగనిపించె

నాకికపై నీవు లేనేలేవని నమ్మకమ్మైనప్పటి నుండి
రాయినై పోయానేమో బాధేదీ లేదప్పటినుండి

- డా॥ అశ్వఘోష్

పూర్వం ప్రతి పక్షానికే మాత్రం బలమే లేదు నిజం
అత్తేయింట్లో అధికారి ఆమేం చెప్తే అదే అందరికీ వేదం

ఇంట్లో నేడందరూ నన్నే అత్తా చూడు సమర్థిస్తున్నారు
ఇకపై నా రాజ్యమే కిచిడీది ప్రతి పక్షం నీవూ నీ వాళిద్దరు

ఆనాటి నుండి వాళ్ళింట్లో అన్నీ కప్పల తక్కెడలు
అటుదిటు ఇటుదటు కప్పలు అనవరతం దూకడాలు

- డా॥ వి.కె. భల్లా

# అభినందన సుమాలు

ఆదర కవిగారికి - మీ పరిచయం నాకు లభించినందుకు సంతోషం. స్వాగతం - మిమ్ము మరోసారి కలుసుకోవాలనుంది. పునర్దర్శన ప్రాప్తిరస్తు

జీవితమ్ములోన శ్రీ కిషన్ కవిగారు
ఆర్ద్ర హృదయుడైన అమృతమయుడు
కలము నందు మధుర కవిత నాట్యము చేయు
కలదు కనుల లోను వెలుగు జిలుగు !

అంతేగాక పరిహాస రసికుడుగా - పరోపకార పారాయణుడుగా జీవితం తీర్చిదిద్దుకున్న మీకు నా హృదయ పూర్వక శుభాకాంక్షలు. స్వాగతం - స్వాగతం.

2) తెలుగు మీరినారు తెలివిలో జగతిలో
గడుసుదనము హెచ్చె కవులలోన
నూరు శాతము కవిగారెవ్వరీ నాడు
జీవితమున కిషను రావు తప్ప !
సాహితీ రచనము ఛందస్సు మాత్రమా
కవిత వ్యాకరణము కాదు కాదు
పలుక రసమయము వాక్యమొక్కటియైన
అక్షరము రసమయ మగును కవిత !

ఆత్మద్యుతులు వ్రాసిన ఆకునూరు గోపాలకిషన్‌రావు కవిగారు ఆపాద మస్తక కవి ప్రత్యక్షర కవిగారు (19.9.2000)

3) ''కవిత'' మీద మీకు గల అభిమానము అనుభవించి మీ వ్యక్తిత్వము గూర్చి నా అభివర్ణన సత్యమని తేలినది.

దివిని వీడి భువికి దిగిరాడు కవిగారు
వెలుగు తళుకు బెళుకు విడువడెపుడు

వారువముగ తాను మారునా ? సింహమ్ము
సలుపు గర్జ దెసలు పులకరింప !

మీ రచనలన్నీ అచ్చు కావాలని నా ఆశీస్సు. మీరు మా ఇంటికి వచ్చి భూమిపై అవతరించిన జీవత్‌దేవ దుందుభివలె - యదార్థ వాదిగ గొప్ప వాక్యాలు పలికినారు. నాకు మీతో ప్రగాఢ పరిచయం ఏర్పడినందుకు గర్వించుచున్నాను. సంతోషించు చున్నాను. మీరు మూర్తీభవించిన కవిత. నాకు నచ్చిన నేను మెచ్చిన వ్యక్తిగా మీరు మున్ముందు నా సభలలో పాల్గొనాలని నాకు కోరిక కల్గినది (23.9.23).

4) శ్రీ కిషన్‌రావుగారు ఆపాదమస్తక కవిగారు. ఆయన ప్రతిస్పందన విన్నాక నాకు ఆయన శతశాతం కవి అని అనిపించింది.

కవిగారి గజళ్లు నాకు అత్యద్భుతమనిపించాయి.

5) శ్రీ కవిగారికి ఆశీస్సులు - మీ లేఖ అందింది. సంతోషం. కవితలో - నిస్సందేహంగా - మీరు నాకంటే ఘనులు.

ఆనాడు మీరు మా ఇంటికి వచ్చినపుడు సత్య సంధునిగా - యదార్థవాదిగా - మేధావిగా, వేదాంతిగా మిమ్ము నేను మనసార గుర్తించినాను.

సదా నేను మీ స్నేహకాంక్షిని. ''కవిగారు'' సార్థక నామధేయుడు. కవిగా మిమ్ము ఆరాధించే వారిలో నేనూ ఒకడను. మీకు నా అభినందనలు.

6) ''యతో కృష్ణః తతో ధర్మః
యతో ధర్మస్తతో జయః'' మీ పట్ల వర్తిస్తుంది.
''విజయీభవ - దిగ్విజయీ భవ''
మీరు చరిత్రాత్మకమైన కవితా కర్తవ్యం చేపట్టినారు.

శ్రీ కవిగారు యదార్థవాది - నూటికి నూరుపాళ్లు ఆకునూరు గోపాల కృష్ణగారు కవివరేణ్యుడు ఆయనకు నేను సన్మానం చేయాలి గాని ఆయన చేత సత్కారం పొందరాదు. కర్మయోగి మాత్రమే గాక కార్యశూరులు కవిగారు

- స్వాగతం
శ్రీశ్రీశ్రీ నందూరి రామకృష్ణమాచార్య

కవిగారికి,

మీరు మా ఇంటికి విచ్చేసినప్పుడిచ్చిన మీ అనువాద కావ్యం 'గజలు సుందరి' కవితా సౌందర్యాన్ని పరవశంతో ఆస్వాదించాను. నాకు ఉర్దూ అసలు రాదు. ఉర్దూ కవులతో నాకు పరిచయం లేదు. కానీ మీ ఉర్దూ కవితానువాదాలు చదివి మూలంతో ప్రమేయం లేకుండా ఎంతో ఆనందించినాను; ఎంతో స్పందించి నాను, నాలో ఎన్నెన్నో కవితా తరంగాలు లేచాయి. నాకెంతో ప్రేరణ కలిగించిన మీ యీ అనువాద రచనను హృదయపూర్వకంగా ప్రశంసిస్తున్నాను. అభినందనలతో -

మీ

ఆచార్య తిరుమల

24-XI-2K

కవిగారూ !

మీరు చేస్తున్న, మీ వల్ల జరుగుతున్న సాహితీ సేవకు అభినందనలు. శ్రీ సినారెకు అర్పించిన మీ స్వచ్ఛంద తెలుగు గజలు బాగుంది. మీరు భావుకులు నమః

డా॥ నాగభైరవకోటేశ్వరరావు

లాయర్‌పేట, ఒంగోలు

ఢంకా బజాయిస్తున్నారు
కవిగారూ నమస్కారం

డా॥ మిరియాల రామకృష్ణ

కాకినాడ - 3.

తెలుగు గజల్ సాహిత్యాన్ని పరిపుష్టం చేస్తున్న మీ కృషికీ పట్టుదలకూ అభినందనలు - ప్రత్యేకంగా సాహిత్యాన్ని ప్రవృత్తిగా స్వీకరించి అందులో లీనమై మీరు చేస్తున్న సాహితీ వ్యవసాయం సాహితీ ప్రియులందరూ గుర్తించదగింది. 1995 నుంచి ప్రారంభమైన మీ సాహితీ ప్రస్థానంలో ఐదు అమూల్య గ్రంథాలను పాఠకులకు అందించి ఆరవ గ్రంథంగా ''కవిగారి ఆత్మద్యుతులు''ను అందిస్తున్నందుకు ఆనందిస్తున్నాను.

డా॥ ఎన్. గోపి

వైస్ ఛాన్సలర్, పొట్టి శ్రీరాములు తెలుగు వర్సిటీ

'కవిగారు'గా హఠాత్తుగా ఆంధ్ర సాహిత్యాకాశంలోకి దూసుకు వచ్చిన శ్రీ అకునూరు గోపాలకిషన్ రావుగారు వెలువరించిన "ఆత్మద్యుతులు" కవితా ప్రియులందరి కన్నులు జిగేల్మనిపిస్తున్నాయి. వివిధ చౌపదలలోని అధిక భాగం మాత్రా ఛందస్సులో వెలువడిన ఈ ఆత్మద్యుతులు రానున్న తేజో నిధుల తొలికిరణాలుగా హాయి గొలుపుతున్నాయి.

ఆంధ్రవ్యాస శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య

# విద్యుద్ద్యుతులు

విద్యుద్వేగాన్నీ, విద్యుత్ప్రకాశాన్నీ తన సాహిత్య కృషికి అన్వయించుకొని ప్రముఖ విద్యుదింజనీరుగా పదవీ విరమణానంతరము విద్యుద్రంగం నుండి విద్వద్రంగంలోకి ప్రవేశించిన కవి - కవిగారు.

"కవిగారి స్వగతాలు" దగ్గర నుంచి ఆత్మిక, ఆధ్యాత్మిక వివేచన వఱకు, స్వార్థం నుంచి పరమార్థం వఱకు సాగుతూ వచ్చిన కవిగారి కవితా తత్త్వం ప్రధానంగా మానవతకి, మంచి తనానికి అంకితమైనట్టిది.

సూక్తులుగా, సత్యవాక్కులుగా, సమాలోచనలుగా, ఆత్మ విచారణలుగా తనకు తాను వెన్ను చఱచుకుంటున్నట్లు ఇతరులకు తట్టి చెపుతున్నట్లు ఆత్మారామ వెలిగించే సిరులుగా రూపొందిన రచన "కవిగారి ఆత్మద్యుతులు". కవిగారికి ఆశీరభినందనలు.

శ్రీమతి సి. వేదవతి

(15-12-2000)

గోకుల్
12-2-826/A/45,
యల్. ఐ. సీ. కాలనీ
మెహదీపట్నం, హైద్రాబాద్

# కవిగారి సాహితీ చిత్రం

ఆకునూరు గోపాలకిషన్‌రావుగారి పేరే కవిగారు. నెమలికన్నును తలలో శ్రీ కృష్ణుడు తురుముకొన్నట్లుగా కవిగారు సాహితీ పింఛాన్ని ప్రదర్శిస్తున్నారు. ఆత్మ ద్యుతులు పుస్తకంలో ''మిగతా జీవితకాలం సాహితీ సేవలో తరించమని సకల బలుని (పరబ్రహ్మ) ఆజ్ఞతో చతుర్ముఖ బ్రహ్మతన రాతగా నా నుదుట రాసిన నా రాత.'' అని కవి చెప్పుకున్నాడు. ఆరోజు 24-9-2000 ఆదివారము. 'అమ్మ కృప' అనురాగానికి పాత్రుడనై అతని ఆతిథ్యాన్ని పొందిన ధన్యత మరవరానిది. మేము కళాశాలలో సహాధ్యాయులము. యశోద నిలయంగా భాసిస్తున్నది ఆ కుటీరము ''అమ్మకృప స్వర్ణాలయం'' ఆడంబర రహితమైన రేకులతో కుటీరంగాతీర్చి దిద్దబడ్డ చక్కని నిర్మాణము అది. దాన్ని చూచి విస్తుపోయాను. "Model Life" అని లోనికి ప్రవేశించాను. చక్కని చాపను పరచి ఆసీనము కమ్మని ఆహ్వానించాడు. చాపచింపు - సామ్రాజ్యం - ఏదయితేం ? అన్న కాళోజీ మాట స్ఫురణ కొచ్చింది. కవి సామ్రాజ్యాధిపత్యము - యోగలక్ష్యము ఆనందాన్ని కలిగించింది. భగవద్గీత తెలుగు గేయానువాదం శుద్ధ ప్రతి వ్రాస్తున్నాడు. నేనన్నాను. ''గోపాల భగవద్గీత - అని పేరిడవోయ్. ఎన్నో భగవద్గీతలున్నాయి కదా !'' అతనికి నచ్చలేదు. ''కవిగారి భవద్గీతే.'' అని నొక్కి చెప్పాడు. అయినా అతని రచనలలోని ఆంతర్యం మొదటి పుస్తకాలలోనే ద్యోతకమవుచున్నది. కవితా ద్యుతుల గ్రంథం ఇచ్చాడు. ప్రణవ చిహ్నము నన్నాకర్షించింది. జనతలోకి చొచ్చుకొని పోయే అతని ఆశయ కవితాద్యుతులు నాకు జ్ఞానోష్ణస్పర్శ, అజ్ఞానునిశీధిని తొలగించే ఉషోదయము కాగా, నా హృదయ కమలం విప్పారినట్లయింది.

కళాశాల అధ్యయన రోజులలో Chemistry, Physics, Telugu, English క్లాసులలో కలిసేవాళ్ళం. గణితము తన ఐచ్ఛికము. మా ఇతర పాటవ ప్రదర్శన లలో పోటీ పడేవాళ్ళం. విశ్వ సాహితీ కార్యాలయంలో ఒక రోజు కూచుని ఉన్నాడు. ''కవిగారు'' అని పోతుకూచి సంబోధించాడు. ''మీ వరంగల్ వాడే!'' నేనాశ్చర్యపోయి చూశాను. నాకు ఆ గోపాలుని ఛాయ 40 ఏళ్ళుకు వెన్నంటి

నట్లయింది. "That shade - It seems you are Gopala Krishna". అని నేననుటతోనే ''నమస్తే, దామోదర రెడ్డి గారు'' అని అన్నాడు. "It is happy to meet you today" అనుకొన్నాము. "So proud of you both కమలశ్రీ, శ్రీ కవిగారు are collegemates" అని పోతుకూచి చమత్కరించారు.

కవిగారి రచనల గురించి ప్రస్తావించినట్లయితే వారి ఖండికలలో సామాజిక స్పృహయుంది. ''త్వమేవ మాతా-పితాశ్చ - త్వమేవ బంధుశ్చ సఖా... త్వమేవ దేవ - దేవ'' అన్నట్లుగా కవిగారి స్వగతాలు విశ్వమంతట నల్పు విలువగలిగినవని, ''పందర్భ స్వరాలు విశ్వాత్మను చాటునవని'', స్వర్ణ గోపాలశతకం'' మూరు విలువల కూరిమియని, ''ప్రియాంశాలు'' సంస్కరణ భావాలని స్వయంగా చెప్పారు - గజలు సుందరి అనన్యమైన అనువాద ప్రక్రియ. వారి ఉర్దూ పాండిత్యానికి ప్రతీకగా యుంది, ఆచార్య సి.నా.రె. గారి కవిత ఆంగ్లంలోకి అనువదించిన 'మౌనరణం' కవిగార్ని వెన్నుతట్టింది. అప్పటి నుండి శిఖలో నెమలిపింఛము ధరించి కవితా వ్యాసాంగానికి పూనుకొన్నాడు. విచిత్రమేమంటే నేమ డా॥ ఆర్. లక్ష్మణమూర్తి MD (హనుమాన్ చాలీసా - వ్యాఖ్యానకర్త) తొలినాటి సాహితీ మిత్రులము. 1965 నుండి అనన్య ప్రతిభతో నిరంతర కవితాకర్షకునిగా కవిగారు ప్రదర్శిస్తున్న సాహితీ మైత్రి త్రిగుణాత్మకంగా మారి మమ్ముల ''మిత్రత్రయం'' గా భాసిల్ల జేయు చున్నది. ఆత్మద్యోతుల కృతిలో సప్తవిధ చైతన్య స్వరూపాలను ప్రదర్శింప జేసినాడు.

రచనలో శబ్ద సౌందర్యం, ఆకర్షిస్తుంది. ప్రియాంశాలలో 'మనక మనసు' ఖండికలో, 'ఇతరుల మాటలు విని మనం - కుతర్కం పాలయి, బుద్ధి కుళ్ళయి- మది తలుపులు మూసుకొందుము. చతురత సంస్కారం - వివేకం కోల్పోయి, అంటాడు. మది తలుపులు - శబ్ద లక్షణము ప్రయోగాత్మక విశిష్టత కలిగి యున్నది. విశ్వనాథవారు 'మనసు గుర్రము రోరి మనిషీ' అన్నారు. మనసుపై ఆవరించిన చీకటి ఆతలుపులు అనే ఆలోచనలను మూసి వేస్తుంది. గజలు సుందరి పుస్తకం లో అనువాదశైలి హృదయ సౌందర్యం కలిగినట్టిది. అయితే కార్లైన్ అన్నట్టుగా ''సౌందర్యం గొప్పదే - కాని ఆ సౌందర్యమును ఆరాధించగల సహృదయత ఇంకా గొప్పది.' అను భావనలో కవిగారు ఉర్దూ పాండిత్య వైభవము తెలుగు ఎదలకందించుట ప్రశంసనీయమైన పని. ఉర్దూ ఛందస్సులో చరణము చివరి

పదము ''రదీఫ్' - రదీఫ్ ముందు పదము ఖాఫియా. అనువాదశైలిలో కవిగారు చాలా ఖండికలలో ఈ చంధస్సును అనుకరించిరి. ఆ విధంగా అనువాద శిల్పము అచ్చుగుద్దినట్లు ఆకర్షింపబడుచున్నది. ''అన్ని శిలల యందద్దాల మెడలు - అన్ని బీజములందు బృందావనాలు ! అణగ ద్రొక్కిన ప్రతి ఇసుక కణము నందు అగుపడును కరుణాళుని చుంబనాలు. ఇలాగ ఖాఫియా పదము మారు తుంటుంది. (పుట - 87).

ఆత్మద్యుతులు పుస్తకములో ఆత్మిక, ఆధ్యాత్మిక మనుభాగములు కలవు. ఓంకార పదములోని 'అ' పరమాత్ముడని 'మ్' జీవాత్మ అని 'ఉ' ఈ రెండిటిని జోడించే ప్రకృతిమాత అని తొలుత నివేదించాడు. గ్రంథం cover page ఓంకార చిత్రముతో చూడ ముచ్చటగా ఉంది. ఆత్మను తెలుసుకొనే మార్గం, మొదటి భాగం కవితలు కలిగి, సుగమమవుతుంది. ''పాలలో నెయ్యి - చెరుకులో బెల్లం- పువ్వులో సువాసన వలె జ్ఞానుల దేహాల్లో ఆత్మ ఉంటుంది.'' అని చాణుక్యుడు అన్నాడు. ''భావమెజీవాత్మ. ప్రత్యక్షమె పరమాత్మ'' అని అన్నమయ్య సెల విచ్చినాడు. కవిగారి భావాల జీవాత్మల ద్యుతులు అలాంటివే !

1. గుడులూ బడులూ
గ్రంథాలయాలు
అర్ధంతో పోల్చదగిన
ఆత్మలాంటి ఆలయాలు !

2. నీదెట్టిదో ఆత్మస్థైర్యం
నిజంగా చెప్పే కొలమానం
కన్నీటి అలల నడుమన
కాస్త నవ్వి చూపించడం !

3. ప్రపంచమంతా నేడు
మహితంగా సౌరశక్తిని
బిల్లు కట్టే గోడు లేకుండా
కొల్లగొడ్తున్నాడు మానవుడు !

ఇలాంటి కవితలు అన్నీ కవిగారి గణిత సూత్రాల్లాంటివని బెంబేలు పడన వసరం లేదు. ఇందులో చాలా చొపదలున్నను 54 పుటలో పనిదొంగల గురించి కంద పద్యం గలదు. కవితకు భాషాకులమత భేదాలు లేవని కవితా, రక్తం - విశ్వాత్మజాలు - అవి హిందూ, ముస్లిం, ఈ సాయిలు కావంటాడు. మరి ప్రపంచ బ్యాంకు, శ్రీశైలం, కొత్తగూడెం పవర్‌స్టేషన్ గురించిన కవితలున్నాయి.

చాలా మంది చదివేది చెడు సాహిత్యమని. మంచి సాహిత్యాన్ని కొద్దిమందే చదువు చున్నారని కవితలలో చమత్కరించారు.

ఆధ్యాత్మిక కవితలలో చాలాసార్లు 'సకలబలుడని' పరమాత్మను గురించి విన్నవించుకొన్నాడు. తొలిపుటలోని కందపద్యము 'సకలబలుని' గురించి ప్రార్థన ఉంది. ఆంగ్లంలోని Almighty నే కవిగారు సకలబలుడని నిర్ణయించారు.

1. సకల బలుడు నాకుతాను
సద్గురువనుకుంటాను
సన్మార్గంలో నన్ను
సంచరింప చూచును.

2. అహంకారియైనాడు
ఆనందం పొందలేడు
అహందూరమైనపుడే
అమృతత్వాన్ని కర్షుడు

3. ఎలక్ట్రాన్ ప్రోటానులను
ఎవడైనా చూడగలిగాడా
అల్పాధిక్యునటువంటి
ఆ సకలబలునెవడైనా చూడగలడా ?

Rhetorical Question రీతి ఆంగ్లంలో గలదు. అలాంటి రీతిలో సకల బలుని దర్శించేసమాధానం పొందుపరచబడిన కవిత అది. ఇంకా ఇస్కాన్‌సంస్థ, హరి నామ ప్రభావం, ధర్మ ప్రబోధం గురించిన కవితలున్నాయి, ఇందులో.

సప్తతి గ్రంథకర్తగా, ఉపనిషత్తుల సారాంశాలు, పురాణాంశాల, బ్రహ్మ సూత్రాల గురించీ, ఇతర అనువాదాలను అందించే కవిగారు ధన్యులు. నోబుల్ బహుమతి గ్రహీతల గురించిన గ్రంథాల కొరత తీర్చే బాధ్యత తీసుకొంటారేమో ! ఇంటర్‌నేషనల్‌పబ్లిషింగ్‌హౌస్ వారి "Man of Achievement" కరకంకణమునందిన కవిగారిని మనసారా అభినందిస్తున్నాను. రవి గాంచనిచో కవిగాంచునన్నట్లుగా కవిగారి కన్ను కాంతి వంతమైనది. ఆ గోపాలకిషన్‌రావుగారి పాతమిత్రుణ్ణే కాబట్టి 24-9-2000 ఆతిథ్యముగ అటుకులు బన్ మజ్జిగ ఇచ్చారు. కుచేల కృష్ణ సాంగత్యము స్మరణ కొచ్చింది. రోజుకొకనెమలి కన్నును ధరించినట్లుగా సాహితీ మయూర పింఛ ధారియై విశ్వవ్యాప్తుడై కీర్తింపబడాలని ఆకాంక్షించుచున్నాను. మా 'మిత్రత్రయం' కథ సాహితీలోకానికి అపూర్వ గుప్త చిత్రం.

ఆవాల దామోదరరెడ్డి (కమలశ్రీ)
Fellowship Awardee Central HRD of Culture

# విద్యుత్తు నుండి విద్వత్తుకు

కవిగారు వ్రాసిన 'ఆత్మద్యుతులు' పుస్తకం రెండుసార్లు నన్ను చదివించింది. ఆత్మిక, ఆధ్యాత్మిక భాగాలలో వ్రాసిన కవితలన్నింటిలోని ఎక్కువ విషయాలు తెలిసినప్పటికీ - చెప్పిన విధానం, కవితా శైలీ చదువలందరికీ సంతృప్తిని కలుగ జేస్తుందనడంలో సందేహం లేదు.

కవిగారు వ్రాసిన ఆత్మికాలలో నాకు బాగా నచ్చినవి :

1) ఒంటరిగా పోరాడేవాడు, ఓటమిని జయించేవాడనీ - అతడే ప్రపంచంలో అందరికన్నా బలవంతుడనీ....

2) అనుకొన్నది సాధించాలంటే (గమ్యాన్ని చేరాలంటే) ఎన్ని అవాంతరా లెదురైనా, పట్టుదలతో అధిగమించాలని... (ఇది చదివితే వివేకానంద స్వామి ఉవాచ గుర్తుకొస్తుంది)

3) ఆంధ్రుడంటే... - తిండి దొరకనప్పుడు, గుండె మండినప్పుడు, మొండి తనంతో తిరుగబడే ఘనుడని... చక్కగా చెప్పారు.

ఇక ఆధ్యాత్మికాలలో నాకు బాగా నచ్చినవి :

1) కేవలం డబ్బు సంపాదనలో మునిగి... దివ్యజ్ఞానం గురించి తెలుసు కోవాలనే విషయం, మానవుడు మర్చిపోతున్నాడని...

2) సుఖదుఃఖాల నొకే విధంగా చూస్తే... ఈర్ష్యా అసూయలు లేకుండా మంచి జీవితం గడుపుతారనీ....

3) పుట్టిన ప్రతి ఒక్కరు, చనిపోతారని తెలిసినా ... తన వాళ్ళు చనిపోతే బాధపడతారనీ...

4) మతాలన్నీ వేర్వేరు మార్గాలు చెప్పినా... అన్ని మార్గాలు చేరేవి ఈశ్వరుని దగ్గరకేననీ...

5) నీవు వచ్చేటప్పుడు ఏదీ తేలేదు, వెళ్లేటప్పుడు ఏదీ పట్టుకు పోలేవు - మధ్యలో సంపాదించేది నీ భుక్తికే అయినా అహంభావివౌతావేమని....

ఇంకా ఎన్నో, ఎన్నెన్నో ఇలాంటి విషయాలు ... కవిగారి వేదాంత దృష్టి, ఉపనిషత్సారమూ, జీవితం గురించి ఆయన అభిప్రాయాలు - సామాన్యులకు, కరదీపిక వోలె ఉండి - మృదువుగా, మనస్సులకు హత్తుకుపోతాయి.

కే. ఎన్. ఆనందరావు
చీఫ్ ఇంజనీర్ (రిటైర్డ్)
విద్యుత్ సంస్థ

16-12-2000
ఫోన్ : 7019496

# పికాలాపనలు

కవిగారి 'గజలు సుందరి' చదివాను. నా చెంతన నేను విడువకుండా నిలుపుకునే పుస్తకాల్లో దాన్ని కూడా చేర్చుకున్నాను. ప్రణయం, విరహం, వేదన, కలబోసిన కవికోకిలలు వచ్చి వాలుతున్న మాఘమాసపు మామిడి తోటలాగా ఆ పుస్తకం నన్ను సేదతీరుస్తుంటుంది. సరళమయిన తెలుగు, కవి హృదయానికీ మనకీ ఎక్కడా అడ్డుపడని అనువాదం, అట్టమీద అందమయిన గాలిబ్ కవీంద్రుని ముఖచిత్రం - కవిగారి 'గజలు సుందరి' ద్విరుక్త పద బంధం. ఏమంటే గజలే సుందరమయింది, గజలు సుందరి మరీ సుందరమైంది.

వి. చిన వీరభద్రుడు
స్పెషలాఫీసర్,
ట్రైబర్ వెల్ఫేర్ కమీషనర్ ఆఫీస్
మాసాబ్ టాంక్, హైదరాబాద్.

16-12-2000

# చక్కని సాహితీ సామర్థ్యం

ఉర్దూలో ఒక చక్కని సామెత ఉంది. మనిషికి శక్తి బాల్యంలో పాదాలలో, యవ్వనంలో నడుమ, వార్థక్యంలో నాలుకలోనూ ఉంటుందట. చిన్న పిల్లలు నిత్యం పరుగులు వేస్తుండడం, యువకులు అధిక సమయం శృంగారక కార్య కలాపాల్లో గడపడం, ముసలితనంలో చిరుతిండికి వెంపర్లాడుతూ నిత్యం ఏదో వాగుతుండడం. ఈ సామెతలోని జీవిత వాస్తవాన్ని చాటుతాయి. అయితే 'కవి గారు' అన్న పేరుతో సుప్రసిద్ధులైన ఆకునూరు గోపాలకిషన్‌రావు గారి విషయంలో ఈ సామెత కొత్త రూపం సంతరించుకుంది. విద్యుత్ శాఖలో 36 సంవత్సరాలు ఇంజనీర్‌గా పనిచేసి పదవీ విరమణ చేశాక ఆయనలో అంతర్గతంగా ఉండిపోయిన కవితావేశం పెల్లుబికింది. చాలామందిలా ఊసుపోని కబుర్లతోను, కొద్దిమందిలా ఆధ్యాత్మిక చింతనలోను కాలం గడపక, పుంఖానుపుంఖలుగా, వరదగోదారిలా పలు గ్రంథాలను తెలుగు పాఠకులకు అందిస్తున్నారు. విశేషమేమిటంటే ఈ ప్రక్రియ యవ్వనోత్సాహంతో, బాల్యంలోని పరుగులను మించి సాగు తోంది. ఆయన ఉద్యోగంలో ఉండి ఉంటే ప్రతియేటా ఇంక్రిమెంట్ వస్తుండేది. కాని ఆయన ప్రతి యేడూ ఒక గ్రంథం చొప్పున తెలుగు పాఠకులకు ఇంక్రిమెంటు గా అందిస్తున్నారు. ఇంత స్వల్పకాలంలో ఇంత విస్తారంగా రాయడం అపూర్వం కాదు కాని అపురూపమని చెప్పవచ్చు. మామూలుగా రాశి పెరిగితే వాసి తరగడం జరుగుతుంటుంది. అయితే కవిగారి కృతులన్నీ వేటికవి ప్రత్యేకత కలిగినవే. ఇందుకు ముఖ్య కారణం ఆయనకు తెలుగుతో పాటు ఇంగ్లీషు, ఉర్దూలలో మంచి పాండిత్యం ఉండడం. అందుకే ఈ అన్ని భాషలలోని సొబగులన్నీ ఆయన రచనలలో ప్రతిఫలిస్తుంటాయి. కవిగారి తాజా పుస్తకం ''కవిగారి ఆత్మద్యుతులు'' ఆత్మ దర్శనంలో ఆయనకు కలిగిన అనుభూతులకు అక్షర రూపాలు. ఈ ఆత్మద్యుతులకు ఆయన ''చౌపదలు'' అని నామకరణం చేశారు. అంటే నాలుగు పాదాల కవితలని అర్థం. తెలుగు పద్యాలలో నాలుగు పాదాలు గల రీతులు ఎన్నో ఉన్నాయి. అయినా వీటిలోని ప్రత్యేకత 'చేపద్'' అన్న ఉర్దూ

పదంతో పాటు ఛందో లక్షణాలకు అతీతంగా ఉండడం. అంటే భావానికే ప్రాధాన్యం ఇవ్వడం. ఆత్మాశ్రయకవితలకు ఈ విశృంఖలత్వం చాలా అవసరం. యాభై ఏళ్ళ క్రిందటనే నాటి బాలగోపాలకృష్ణునిలో కవిగారిని దర్శించి ఆ పేరుతోనే వ్యవహరించిన ఆయన మేనమామ దేవులపల్లి వేంకటేశ్వరరావుగారి వాక్శుద్ధిని సార్థకం చేసినందుకు కవిగారిని మనసారా అభినందిస్తున్నాను. ఆలోచనలు, అనుభూతులు, అభిప్రాయాలు అందరికీ ఉంటాయి. అయితే కొందరు మాత్రమే వాటిని వ్యక్తం చేయగలరు. వారిలో కూడా కొద్ది మంది మాత్రమే మనసుకు హత్తుకునేటట్లు, మరిచిపోలేనట్లు అందులోనూ కవితా రూపంలో అందించగలరు. ఆ కొద్దిమంది ప్రజ్ఞావంతులలో కవిగారు ఒకరు. ఆయన ప్రస్తుతం వెలువరిస్తున్న "కవిగారి ఓంకార నాదాలు" ఆత్మద్యుతులు కన్నామిన్నగా పాఠకుల నలరిస్తుందని నా భావన. అవి నిజంగా ఓంకార నాదాలే.

-కె. ఆర్. కె. మోహన్



# పురస్కృతి

నూటికి పైగా, నూటిగా కావ్యాలనే వెలయించనుండడం, కవిగారి వంటి వారికి, నల్లేరుపై బండి నడకగా, కవితాధార సాగకపోతే, సాధ్యమయే సంగతేనా !

అందునా, ఒక ఇంజనీరుగారి వలన అయ్యే పనేనా !

పరాత్పరునకు, కవిగారు పెట్టిన పేరు, సకలబలుడు - ఆకునూరు గోపాల్ కిషన్ గారిలో, కవిగా ఆ సకలబలుడు పరకాయ ప్రవేశం చేసి ఉండకపోతే, అనతి కాలంలో అన్నికృతులు అలా వెలయించడం వీలుపడగలిగేదేనా !

మీదు మిక్కిలి, కవిగారు వ్రాయలేని కవితా ప్రక్రియ లేదంటే, అవునా ! అని అబ్బుర పడకుండా ఉండడం జరిగేపనేనా !

తనదైన ప్రత్యేకమైన కవితా పద్ధతి తనే అనుకోకుండా, అవలీలగా, కవిగారి కలం నుండి జాలు వారుతున్నదంటే, ముక్కున వేలేసుకోకుండా ఉండగలరా ఎవరైనా !

ఒక్క తెలుగంటే - తెలుగువారే కదా - సరస్వతీ పుత్రులే కదా - బ్రాహ్మీ మూర్తులే కదా - సంస్కృత భాషాయోషనడయాడే భారతీయ కుటుంబీకులే కదా - అని సరిపుచ్చుకోదలచినా - ఉర్దూ - హిందీ - ఆంగ్లంలోని కవిత్వ పటుత్వం చూస్తే ఇతడు ఉర్దూ కవియని - కాదు, హిందీ కవియని - కాదు కాదు, ఆంగ్ల కవియని తర్జన భర్జన పడకుండా ఉండగలమా !

మహా మహా కవి పండితులు సైతం, మేము గాక మరొకరు 'కవిగారు' పేరుతోనా ! అని మనసులో మధన పడకుండా ఉండగలనారేనా !

కవిగారి కావ్యాలలోని పదప్రయోగాలు, శిరోధార్యంగా స్వీకరింపక పోవడం, జరిగేపనేనా !

ఆగష్టులో విడుదలైన "కవిగారి ఆత్మద్యుతులు" ఈనెల విడుదలకు సిద్ధమైన "కవిగారి ఓంకార నాదాలు కవి పండితులను, పండిత కవులను ఏకరీతిగా ఆశ్చర్యపరచే రీతిలో ఉన్నాయి. ఇదీ కవిగారి అక్షరదక్షత, ఆరేళ్ల కన్నా తక్కువ లోనే అరవైయేళ్ళ కవిత్వం వ్రాయడం ఆశ్చర్యం కాక మరేమిటి ?

సహస్రానేక భావపరంపరలతో, సర్వకాలీనమైన, విశ్వజనీనమైన, మాననీయ మైన కవిగారి కావ్యకృతులు, పఠన పాఠన యోగ్యములు - సర్వశ్రేష్ఠములు.

అందుకే, ఆకునూరు గోపాలకిషన్ - కవిగారు - కవిశ్రేష్ఠులు.

అతనికీ - అతని కృతులకూ త్రికరణ శుద్ధితో నమస్కృతియే పురస్కృతి -

అర్చకవిభూషణ

పెద్దపల్లి సత్యంనాయుడు

హైదరాబాద్

12-12-2000

శ్రీ కవిగారు ప్రముఖ ఇంజనీరుగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ సంస్థ నుండి మంచి కీర్తి గడించి రిటైరనారు.

వారిలో ఉన్న తెలుగు భాషా ప్రీతి వల్ల తెలుగు సాహిత్యంలో నిష్ణాతులు, ఘన ఉపన్యాసకులు డా॥ స్వర్ణలత గారిని చేపట్టారు.

కవిగారి మేనమామలు సాహితీ రంగంలో విశిష్టస్థానాన్ని పొందినవారు. ఈ నేపథ్యంలో వీరికి అంతర్వాహినిగా కవితాధార పెల్లుబికి వస్తున్నది.

రిటైర్ కాబోయే కొన్ని నెలల ముందే రచనా వ్యాసంగం మొదలు పెట్టారు. మొదలుపెట్టినప్పటినుండి వెనుదిరిగి చూడకుండా పుంఖాను పుంఖంగా వ్రాస్తున్నారు.

ఒక ఊరు కాపు ఒక ఊరు మాల అన్నారు. తన వ్యాసంగంలో నిష్ణాతుడైన వాడు కూడా ఇతర రంగాలలో కొచ్చినవారు రాణించడం కష్టం. అయినా కవిగారు కవితా వ్యాసంగంలో మొదటి నుండీ ఉన్నవారివలె పద్య, గద్య, గేయ, గీత, గజల్, వ్యాసాల్లాంటి అన్ని సారస్వత ప్రక్రియలలో సమాన ప్రతిభతో వ్రాస్తున్నారు.

కవిగారి స్వగతాలు, సందర్శ స్వరాలు, స్వర్ణగోపాల శతకము, ప్రియాంశాలు, గజిలు సుందరి, ఆత్మద్యుతులు మఱియు ఈ ఓంకార నాదాలు ఆరు సంవత్సరాలలో వ్రాసిన 72 పుస్తకాలలో ఏడు మాత్రమే. దేనికదే ప్రత్యేక అందాన్ని సంతరించుకున్నది.

ఈ మధ్య విడుదలైన ''ఆత్మద్యులు'' (1040) ఇప్పుడు ఈ ''ఓంకార నాదాలు'' వీటిలోని చేపదలు, నాదాలు (గజళ్ళ లాంటి కవితలు) సూటిగా చదువుల మనస్సులు దోచుకుంటాయి. ఒక్కొక్కటీ ఒక్కొక్క ఆలోచన ఒక్కొక్క అభిప్రాయం ఒక్కొక్క సూక్తి.

కవిగారి నుండి కవిత్వం ప్రవాహంగా వస్తోంది. ఇది ధారావాహికంగా సాగాలి, వారు సాగించాలని ఆకాంక్షిస్తూన్నాను.

కవిరత్న మాదాసు పిచ్చయ్య

9-11-2000

# కవిగారి సాహిత్య సేద్యము

ఆకుమారు గోపాలకిషన్‌రావుగారు 36 సంవత్సరాల కాంతిశక్తి (ఏ.పీ. యస్.ఈ.బీ)లో పనిచేసి ముఖ్య విద్యుదింజనీరుగా 10/95 పదవీ విరమణ చేసేందుకు 8 నెలల ముందు ఆంధ్రజ్యోతి డైలీ ఆదివారం 20-02-1995 న ఆచార్య శ్రీ సి. నారాయణరెడ్డిగారి తెలుగు గజల్ 'మౌనరణం'ను ఆంగ్లం ఉర్దూ లలోనికి అనువదించి రెడ్డిగారి మెప్పునందుకున్నారు. 50 సంవత్సరాల క్రితమే పెదమేనమామగారు కీ॥ శే॥ దేవులపల్లి వెంకటేశ్వరరావు (దేవేరా) గారు పిలిచిన "కవిగారూ" అన్న పేరు (కీ॥శే॥ దేవులపల్లి రామానుజారావుగారి చిన్నాన్నగారి కుమారుడు, ప్రముఖ కవి) తనను 'కవిగారు' అని పిలిచేవారు. అదే కలం పేరు పెట్టుకుని ఆ నాటి నుండి నేటికి క్రాంతి శక్తుడు (కవిగా) 72 కవితా సంకలనాలు పూర్తిచేసి ఈ పుస్తకంతో కలిసి 4 సంవత్సరాలలో 7 పుస్తకాలు సాహితీ లోకానికి సమర్పించుకున్నారు. అవి :

1. "కవిగారి స్వగతాలు" (11/96) బంధుమిత్రులపై కవితలు శ్రీ సి.నా.రె. ఆవిష్కరించారు.
2. "కవిగారి సందర్భ స్వరాలు" (4/97) అన్ని పండుగల (హిందూ, ముస్లిం, ఈసాయి, స్టేట్, నేషనల్) పై కవితలు శ్రీ కాళోజీగారు ఆవిష్కరించారు.
3. "కవిగారి స్వర్ణగోపాల శతకం" (6/97) 100 మానవీయ విలువలపై కంద శతకం శ్రీ పోతుకూచి సాంబశివరావు గారు ఆవిష్కరించారు.
4. "కవిగారి ప్రియాంశాలు" (10/97) సామాజిక సమస్యలు - పరిష్కారాలు. శ్రీమతి నాయని కృష్ణకుమారి గారు ఆవిష్కరించారు.
5. "కవిగారి గజలు సుందరి" (12/97) గాలిబ్ మరియు 125 ఇతర ఉర్దూ రచయిత కవితల అనువాదం శ్రీ బాపురెడ్డి గారు ఆవిష్కరించారు.
6. "కవిగారి ఆత్మద్యుతులు" (8/2000) ఆత్మిక ఆధ్యాత్మిక సిరులు (1000 కి పైగా చౌపదల కృతి) అక్షర వాచస్పతి డా॥ దాశరథి రంగాచార్యగారు ఆవిష్కరించారు.

7. ఈ పుస్తకం 'కవిగారి ఓంకార నాదాలు' ఆచార్య గోపిగారు 27-12-2000 (గాలిబ్ 203వ జన్మదినం నాడు) ఆవిష్కరించనున్నారు. శ్రీ సి.నా.రె గారికి ఈ పుస్తకం అంకితం.

1998-199 లో 12 ఉపనిషత్తులు (ఈశావాస్య, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, శ్వేతాశ్వతర, కైవల్య, అమృతబిందు) స్కందోపనిషత్తులు), భగవద్గీత కూడా తెలుగు, హిందీ భాషలలోనికి, అనువాద కవిత్వీకరణ పూర్తి చేసి, వేదాలలోని నేటి కాలానికి అనుగుణమైన మంత్రాలనూ కవిత్వీకరిస్తున్నారు. ఇలా తన సాహితీ ప్రస్థానంలో ఫిబ్రవరి 95 నుండి నేటి వరకు ఆరున్నర సంవత్సరాలలో డెబ్బది కృతుల కర్త కావడమే కాక, సూక్తి భాస్కరుండు సుకవిగారు అనే శతకం పూర్తిచేసి, ఐదారు ఆంగ్ల సంకలనాలు, ఒక ఉర్దూ, ఒక హిందీ సంకలనం పనిలో నిమగ్నులై ఉన్నారు.

గంగా ప్రవాహంలా పరుగులిడే అన్ని కవితలూ సులువైన తమదైన బాణీలో ఉండి అరమరికలు లేని మనస్సుతో చదివిన వారెవరికైనా అలరిస్తాయి, ఆనందింప జేస్తాయి. అష్టాదశ పురాణాలు, భారత-రామాయణాలు తెలుగు ఆంగ్లంలో కవిత్వీకరించి 'శతాధిక గ్రంథకర్త' కావాలని కవిగారి ఆకాంక్ష.

తెలుగు - ఉర్దూ నిఘంటువు రచనా నిపుణులలో ఒకరినిగా ఆంధ్రప్రదేశ్ ఉర్దూ అకాడమీ వారు కవిగారిని నియమించడం ఆయన భాషా దక్షతకు నిదర్శనం. ఈ పని కూడా పూర్తి అయినందున ఇది ఆయనకు మరో కలికి తురాయి.

# కవిగారి కళాపీఠం

అమ్మకృప - స్వర్ణాలయం
**97, వాసవీ కాలనీ 'ఎ',**
**సికింద్రాబాద్ - 500 015. (ఆం.ప్ర.) ఇండియా.**
**ఫోన్: 7747882**

# అనుభవాల కాంతులు

కవిగారు స్వేచ్ఛాపథంలో విహరిస్తారు. ఇందులో సహస్రాధిక ఆత్మద్యుతు లున్నాయి. పి. నారాయణరెడ్డి ఈ కవితల్ని 'కవిగారి ఆత్మీయాంశాల వాహిక' లన్నారు. ఇంకా 'వాటిలో యతిప్రాసలు, ఛందోబంధాలు లేకపోవచ్చు కాని కవితా రేఖలంతగా ఉన్నాయి. అవి సూక్తుల్లా మెత్తగా గుండెను తాకుతాయి' అన్నారు. విధి నిర్వహణ ఒక్కటే వ్యక్తికి న్యాయమైన సన్మానమంటారు కవి.

'సన్మాన అవమానాలకు /చక్కని కొలమానాలు లేవు/నీ భవ్యవిధి నిర్వహణే నీకు/ నిక్కమైన సన్మానం వేరేవీ కావు'' అంటూ సృష్టిరహస్యం చెబుతారు.

కవి పూర్తిపేరు ఆకునూరు గోపాలకిషన్‌రావు. కానీ మేనమామగారు చిన్నతనం నుండి ఆయన భావావేశం చూసి ''కవిగారు'' అని ముద్దుగా పిలిచారట. అప్పటి నుండి ఆయన పేరు ''కవిగారు''గా స్థిరపడిపోయింది.

''పూల వాసనలు ముళ్ళు/ పుణికి పుచ్చుకోగలవు/ముళ్ళ కర్కశత్వం పూలు/ ముమ్మాటికి పొందలేవు !''

ఎంత సుకుమారుడు, భావుకుడు కాకుంటే ఇంత అద్భుతమయిన అభివ్యక్తి వీలవుతుంది ? ఈ విధమైన అనుభవ శకలాలు అసంఖ్యాకంగా ఈ గ్రంథంలో ఉన్నాయి. ఆయన నిరంతర దర్శనాతరంగాలలో తరంగితం కావాలంటే ఈ ఆత్మద్యుతుల్లోకి మనం సాగాలి.

*విజయకుమార్*

***3-12-2000 ఆంధ్రప్రభ డైలీ (ఆదివారం) విశ్లేషణ***

గాలిబ్ (1797-1869) గజల్‌గాక, ఇతర ఉర్దూ కవిరాజులవి నూట పాతిక మందివి (గజల్స్) తెలుగు చేశారు. కిషన్‌రావు 'అన్నీ వదులుకున్నాను. ఆమె జ్ఞాపకాలు తప్ప' : 'నిర్లక్ష్య వీక్షణాలతో - నేడు ప్రేయసి కలిసెను' : 'అన్నిటా నీవు - ఉన్నావంటారు - ఎచ్చోటా ఎవ్వరూ - నిన్ను చూసి ఎరుగరు' : 'గుండె మీద గోళ్లు - వేసె నాగేటి చాళ్లు' : భాగ్యనగరమందే ఎన్నో-బీద అరుపు వినిపిస్తవి' : 'కీర్తి దాహం తీరేదికాదు - పేరుప్రతిష్టల కోరిక పోదు' : 'ఆకాశంపై ఉదయాన-గుప్పితివి ముఖ సౌందర్యం-సాయంత్రం సమయాన-విప్పితివా కబరీభరం' : 'శోకమేల కలదో సంగీత మందు-నిట్టూర్పులేలనో దరహాసమందు' : 'గుండె గాయపు వెలుగులే - మెండుగా నా జీవితం' : 'వాడినపూదోటలనే - వసంతం చక్కబెట్టు'... ఇటువంటి ఆణిముత్యాలు, వజ్రపు తునకలూ, మీరు ఏరుకోగలిగినన్ని ఉన్నాయి. తెలుగు కవితా సరస్వతిని', 'గజలు సుందరి' అనే రత్నాల హారంతో అలంకరించారు. ఆకునూరు గోపాలకిషన్‌రావు 'కవిగారు'.

*దయానిధి,*

*జగతి మాసపత్రిక, మార్చి 2000, చెన్నై.*

# MAN OF ACHIEVEMENT




*International Publishing House,*
*The world's most leading biographical specialists,*
*does hereby proclaim that ...*

## *Shri A. Gopala Kishan Rao*

*has been selected for*

THE MAN OF ACHIEVEMENT AWARD 2000

***For being a most spiritually inclined person, who stands irrevocably dedicated to the service of Almighty and upliftment of the mankind.***

Director
International Publishing House




INTERNATIONAL PUBLISHING HOUSE

↓ 2-11-2000

## శ్రీమాన్ కవిగారికి

మీ అక్షరద్యుతుల (కవిగారి ఆత్మద్యుతులు) నందుకున్నాను. సర్వావయవ సమ్మోహన సంపూర్ణ సారస్వత గ్రంథం - ఓర్దవీయ (ఉర్దూ సంబంధి) భావాల్లోనే కాక ఆంధ్రవీయ భావనలందు కూడా కవిగారు ఉండటం సహజ పరిణామమే. రెండు కళ్లవసరం - మీకు కొందరు రెండు భాషలే వచ్చుననుకుంటారు. మీకు నాల్గు భాషలు వచ్చుకదా. అది కృతార్థత. రెండు దిక్కులూ చూశాను. ఈ కృతిలో ఆత్మికాలన్నీ ముప్పాతిక పాళ్లు భారతీయ భావనాదర్పణాలు. కలంపుచ్చుకుంటే వచ్చేవి కావు. గళం విచ్చుకుంటే వచ్చేవే అవి. రెండోవెడ ఆధ్యాత్మిక భావాల మెరుపులు. అభారతీయం భారతీయంగా చెలామణి అవుతున్న తరుణంలో అవి రావడం స్వాగతానందం అందుకోవడం కూడా. మీఫైరింగు స్ప్రింగులాంటివి.

↓ 31-8-97 ↑ 4-9-77

## సాహితీ సన్మార్గులు శ్రీ కలిగారికి నమః

పత్రం కరపత్రం దినపత్రం అందాయి. ఆదర్శాలు,ఆశయాలు ఆశావహంగా అవిశ్రాంత యాత్రా భారతి ధూర్వహంగా ఉన్నాయి.

శుభంబగుగాక.

↓ 17-8-97 ↓ 21-8-97

## ప్రియాత్మీయ శ్రీ కవిగారికి నమః

నా కవిత పట్ల మీ అనువాద అభిమానానికి కృతజ్ఞతలు. మీలాంటి అనువాదకులకు అమ్మకృపలాంటిది, ఇండియన్ లిటరేచర్ (న్యూఢిల్లీ) పత్రిక. ఆంధ్రదేశం కవితా మార్గాన్ని కోల్పోయి, తిరిగి పునరుజ్జీవనం పొందాల్సిన దశలో ప్రవేశించింది. ఆ దశలోనే ఉన్నాం మనం.

భవదీయ

**డా॥ మిరియాల రామకృష్ణ**

కాకినాడ.

# మనోరంజని - సంక్రాంతి సంబరాలు

## బహుమతోత్సవం



శ్రీ కవిగారు

మనోరంజని సంక్రాంతి సందర్భంగా

పోటీల కవిత బహుమతి ప్రథమ

పొందినందుకు అభినందిస్తున్నాం

తేదీలు : 13-1-98, 14-1-98



కుప్పాల వరదరాజ్
కర్త మనోరంజని అధ్యక్షులు
ఫోన్: 760748

వేదిక : శ్రీ త్యాగరాయ గానసభ, చిక్కడపల్లి, హైదరాబాదు-20.



కవిగారి బిడ్డ - అల్లుడు డా॥ స్వప్న - ఇంజనీర్ క్రిష్ణ
కొడుకు చి॥ శౌర్య, కూతురు చి॥ స్ఫూర్తి లతో



కవిగారి దారిలో సత్కారాలందుకుంటున్న
కుమారుడు చి॥ గౌతం - కొడుకు చి॥ అమోఘ్